# కపస కళా కోవిదులు

## రాజనీతి విశారదులు





[illegible]

లక్కరాజు వేంకటలక్ష్మీనరసింహారావు

Acc. No. 15784

# కవన కళా కోవిదులు

## రాజనీతి విశారదులు

65/3





లక్కరాజు వేంకటలక్ష్మీనరసింహారావు

Rs. 8-00

ప్రథమ ముద్రణము 1977
ప్రతులు 500

వెల

From the dead hand I take the bow he wielded
To win for us dominion, might and glory
Thou there, we here, rich in heroic offspring
Will vanquish all assaults of every foeman.

— A hymn from Rig

ప్రకాశకులు :

**K. V. L. Narasimha Rao**
**Author and Publisher**
**KOTHAPET, ONGOLE.**

# An Introduction

"I found my self between Scylla and Charbdys" writes Gandhiji I don't want a Trojan Horse in my party" says Sri Morarji, our Prime Minister. "Harbours Narcissus complex about his cleverness" jibes a journalist. 'The Continent of Circe ' is the title of Nirand. C. Choudary's thought provoking book about India. Besides these, we frequently come across terms like ' gordian knot ' 'Penelope's web', 'Apple of discord' 'Augean Stables' and attributives like Sisyphean, Protean, Procrustian, Herculean Greek mythology, epics and history have thus become interwoven with English Language and lend it colour and flavour. Greece with its mythical and historic past was the source and fountain head of inspiration to early English Romantic poets.

No wonder Shelly joined the greek war of Independence from Ottoman dominion to repay, with his life, his debt to that hoary land.

Any amount of wishful thinking or misplaced linguistic chavinism can Hatao English out of India. It must be recognised that it is one of the languages of India either as a link or even a library language. Being the only window on the world outside with its treasures, Science, Technology and culture, English is bound to remain for all time a part of school curriculam. There can be no proper comprehension or appreciation of English without at least a nodding acquaintance with the epics and myths of ancient Greece and Rome.

The author of these valuable books Sri L.V L Narasimha Rao has done a commendable job of bringing out Telugu versions of the Illiad and the Odyssey. He has delved deep into all available sources and with remarkable industry and zeal brought out these books which are most useful to the lay Public as well as to the students of literature. These books serve as a good introduction to the study of English language and literature. The present, the third in the series, is the Telugu version of 'Plutarch's Lives'. They contain the ore which the great shakespere transmuted by the chemistry of his genius into burnished gold in the form of Histrorical Plays. A study of the lives of the great heroes herein described is bound to

stimulate the imagination of the readers as well as satisfy their love of adventure.

A word about the language of the book. As these books are meant for the lay reader they are written in easy simple idiomatic language. Mr. Rao shows a firm grasp as well as grip of both spoken and classical Telugu. In the result the book becomes eminently readable. I only hope that the popularity of these books will be a spur to the author's further efforts in the same direction.

**(Sd) Donepudi Raghava Rao,**

*Retd head Master*

**Municipal High School, Ongole.**



శ్రీ లక్కరాజు వేంకట లక్ష్మీనరసింహారావు గారు నా బాల్యస్నేహితులు. వీరు స్వాతంత్ర్య సమరమున పాల్గొని 4, 5 సంవత్సరములు దేశసేవజేసి పిమ్మట ఉపాధ్యాయ వృత్తి స్వీకరించి విద్యార్థుల మనోవికాసమునకు అనేక విధముల కృషిసల్పియుండిరి.

వీరికి ఇతోధిక గ్రంథరచనము చేయుటకు భగవంతుడాయురారోగ్యముల నొసంగు గాతయని ప్రార్థించు చున్నాను,

వావిలాల వేంకటేశ్వర శాస్త్రి
న్యాయవిద్యాప్రవీణ
సంస్కృత పండితుడు, ఆగిరిపల్లి

# జూలియస్ సీజర్

సీజరు చిన్ననాటి నుండియు ఆపదల నెదుర్కొని జీవితము గడపవలసివచ్చెను. ప్రభుత్వ మతని కుటుంబ వైరియగు సిల్లా చేతిలోనుండెను. అందుచే సీజరు స్వేచ్ఛగా జీవితము గడపుటకు వీలుగాకుండెను. బాలుడగు సీజరు సిల్లా కంటికి పెక్కు మారియుస్‌లుగా గోచరించుచుండెను. అందుచే సిల్లా ఆ బాలుని వేటాడదొడగెను. అతని బారినుండి తప్పించుకొనుటకు సీజరు పూటకొక యిల్లు మారుచుండెను. అట్లు మారుటలో ఒకానొక సమయమున సీజరు సిల్లా భటులకు పట్టుబడి వారి నాయకునకు రెండుటాలెంటుల స్వర్ణము నిచ్చి బయటబడి రోము నగరమును వదిలి పరదేశములకు బోవ నిశ్చయించి పడవ యెక్కి పయనించుచు ఓడ దొంగలకు పట్టుబడెను. వారు అతనిని యిరువది టాలెంటులకు అమ్మజూపిరి. అంతకన్నను తాను యెక్కువ విలువగలవాడననియు చెంతనున్న నగరమును జేరిన తనకు మంచిధర వచ్చుననియు అతడు వారికి చెప్పెను. అతని మాటలు నమ్మి వారతనిని మిలేటస్ నగరమునకు గొనిపోయిరి. అతడచ్చట తన మిత్రుల సాయమున వారికి యే బదిటా

లెంటులిచ్చి విముక్తి వడసి నగరమునకు బోయి అనుచరుల బ్రోగుచేసికొని వచ్చి వారి నౌకను ముట్టడించి వారందరిని బంధించి తానిచ్చిన ధనమునేగాక వారి చెంతనున్న ధనము నంతను అపహరించి వారిని న్యాయాధిపతి కప్పగించి శిక్షలు వేయించెను.

పిమ్మట నతడు కళాశాలయందు ప్రవేశించి ఉన్నత విద్యనభ్యసింప మొదలిడెను. ఆ కళాశాలయందలి విద్యార్థులందరిలో సిసిరో గొప్ప వక్తయని ఖ్యాతిగడించియుండెను. అధ్యాపకుడు సీజరు ప్రతిభనుజూచి శ్రద్ధగా అభ్యసించినచో సీజరు అతని ననతి కాలములో నధిగమింపగలడని వచించెను. కాని సీజరు దృష్టి తత్వశాస్త్రము మీదను వక్తృత్వము మీదను లేదు. అతని దృష్టి సైనిక విద్యయందును సామ్రాజ్య నిర్మాణమునందును లగ్నమైయుండెను. (అతడు చిన్ననాడిట్లు సైనిక విద్య నభిమానించినను పెద్దవాడైన పిదప అశాశ్వతమగు ప్రపంచ సామ్రాజ్యాధిపత్యము కన్నను శాశ్వత మగు సాహిత్య సామ్రాజ్యాధిపత్యమే గొప్పదని ఉగ్గడించెను) ఆ కళాశాల యందలి చదువును పూర్తిచేసిన పిదప అతడు గ్రీసు దేశమునకు బోయి పాలకులకు వలయు విద్యల నన్నిటిని క్షుణ్ణముగా చదివెను. ఇట్లు విద్యాభ్యాసమునుముగించి అతడు స్వదేశమునుజేరి ప్రభుత్వమున ఉన్నత పదవులకు యత్నింపమొదలుబెట్టెను. అంతలో

అతని మేనత్తయగు జూలియా (మారియుస్ భార్య) స్వర్గస్తురాలయ్యెను. ఆమెకు జరిగిన అంత్యక్రియలయందు అతడు మారియుస్ ఘనతను ప్రశంసించుచు గొప్ప ఉపన్యాసము గావించెను. దానిని జూచి ప్రభుత్వాధికారు లతనిపై కనుక వహించిరి. కాని ప్రజాసామాన్యము అతని ధైర్యమునకు మెచ్చి అతని పక్షమున జేరిరి. వారి సాయముతో అతడు క్వెస్టరుగా (Quester) స్పెయినుదేశమునకు బోయెను. అతడచ్చట పెక్కుయుద్ధములు గావించి పెక్కు నగరముల నాక్రమించి ఆ దేశమున చక్కన పరిపాలనమును నెలకొల్పెను. అచ్చట జరిగిన యుద్ధములలో అతని కశేషమగు ధనము లభించెను. ఆ ధనముతో అతడు రోమునగరమునకు తిరిగివచ్చి కాన్సలుగా ఎన్నికయయ్యెను. ఈ ఎన్నికయందు పాంపే, క్రాసనులు అతని కెక్కువగా తోడ్పడిరి.

ఈ పదవిని చేపట్టినపిమ్మట అతడు గాలులో గవర్నరు పదవిని సంపాదించెను. ఆ పదవిలో అతడు పెక్కు యుద్ధములు కావించెను. ఆ యుద్ధము లందతడు రోమనులలో మిక్కిలి ప్రఖ్యాతి గడించిన సిల్లా, మారియుస్, లకుల్లీ మున్నగువారి కన్నను గొప్ప సేనాని అను ఖ్యాతి గడించిప గలిగెను. ఆ యుద్ధములలో సైనికు లతని యెడ ప్రదర్శించిన భక్తి ఆదర్శప్రాయమైయుండెను. సీజరు ప్రబోధమును విని సంగరమున అడుగిడిగిన సైనికులు ఆకలి దప్పులను

మరతురు. శ్రమను సరకు సేయరు. ప్రాణములను తృణప్రాయములుగా భావింతురు. రోమనుల శౌర్యమును లోకమునకు చాటుట ఒక్కటే వారికి ధ్యేయమైయుండును. ఒక్క ఉదాహరణమును జూచిన భటు లతని యెడచూపు విశ్వాసమును మనము గ్రహింపవచ్చును. కాషియుస్ సియేవా Cassius seaeva అను యువకుని దేహమున నూటముప్పది గాయములు తగిలినను, తుదకొక కన్ను పోయినను, శత్రువులను రణరంగము నుండి పారద్రోలు వరకును ఎత్తిన కత్తిని దింప నిరాకరించెను. గాలులో అతడుచేసిన యుద్ధములనేకములు. అతడా దేశమున ఎనిమిదివందల నగరముల నాక్రమించెను. పది లక్షల మంది వీరులను వధించెను. మరియొక పదిలక్షల మంది వీరులను ఖైదీలుగా బట్టుకొనెను కాని అతడు జయించిన నగరములందలి ప్రజలను యెట్టి హింసలకును గురిచేయలేదు. అంతేగాదు: స్వాతంత్ర్యము కోల్పోయితి మను భావము సైతము వారికి కలుగనీయలేదు. అతడు గాలులో పది సంవత్సరములు గడిపి మూడు వందల రాజ్యములను తమ రాజ్యములో కలుపుకొని వానియందు సుస్థిరమైన ప్రభుత్వము నెలకొల్పెను.

ఇచ్చట అతడు కావించిన యుద్ధములలో అతనికి లభించిన ద్రవ్యములో ఒక్క రూకనైనను అతడు గైకొనలేదు. లభించిన సంపదల నన్నిటిని అర్హతలకు తగిన విధ

మున సైనికులకే పంచియిచ్చెను. అతడు తన సైనికులలో ఎవరు ఎంత త్యాగము గావించిన వారినంత ఘనముగా బహూకరించెను. ఇట్లు ఔదార్యము చూపుటయేగాక తన నడవడిసైతము వారికాదర్శప్రాయముగానుండునట్లు అతడు దేశసేవకు జీవితము సంకితము గావించి కృషి సల్పెను. జన్మతః సుకుమార శరీరుడు, అనారోగ్యము వలన దుర్బల దేహుడు, అయ్యును అతడు యుద్ధము తలపెట్టిన పిదప విశ్రాంతి నాశింపక రణ రంగమున సంచరించెను. దీర్ఘ ప్రయాణములకు గాని, అకాల భోజనములకుగాని, కఠిన శయ్యలకు గాని, అతడు నొచ్చుకొనలేదు. చిన్ననాటి నుండియు అశ్వారోహణమున అసాధారణమయిన ప్రజ్ఞ కల వాడగుటచే ఎట్టి దూర ప్రయాణము నైనను అతివేగముగా సలుపగలుగుచుండెను. రోములో బయలుదేరి ఎనిమిది రోజులలో 'రోను'ను చేరి అతడు పగతుర నాశ్చర్యచకితుల గావించెను. గాలులో అతడులక్షాతొంబదివేలసైనముతో తనమీదకు వచ్చిన టిగురిని Tigurini అను జాతివారి నోడించి తరిమివేసెను. పిమ్మట అకస్మికముగా తనమీద బడిన హాల్వేషియనుల (Halvatian) నెదుర్కొని పోరి వారిని జయించెను. వీరితో నితడు అర్ధ రాత్రమువరకును పోరు సల్పవలసివచ్చెను. పిమ్మట నితడు జర్మనులతో పోరి వారిలో ఎనుబది వేలమంది వీరులను వధించి మిగిలిన

వారినియే బది మెళ్లు తరిమికొట్టెను. అంతలో గాలులు అరు వది వేల సైన్యముతో వచ్చి అతనిపై బడిరి. సీజరు అతి సాహసముతో పోరి వారిని జయించెను. అతని మీాఁకి వచ్చిన అరువదివేల మంది గాలులలో అయిదువేల మంది మాత్రమే తిరిగిపోవగలిగిరి. అంతేగాదు ఆ యుద్ధమునకు కారకులయిన నాలుగు వందల మంది సెనెటరులలో ముగ్గురు మాత్రమే బ్రతికి బయట బడగలిగిరి. ఈ విజయవార్తల వినినవెంటనే రోమనులు రాజధాని నగరములో పదునైదు దినములు దేవతలకు ఉత్సవములు చేయించిరి

ఈ విజయములు సాధించిన పిమ్మట సీజరు "పో" నది చెంత విశ్రాంతి గొనదలచి నిలచెను. అతడచ్చట నున్న కాలమున రోమునగరమందలి ప్రభుత్వాధికారులలో అనేకులు- సెనెటరులు, గవర్నరులు, పాంపే, క్రాసస్ మొదలగువారు వచ్చి అతని నభినందించుటయేగాక అతని సేనాపతి పదవిని ఐదు సంవత్సరములు పొడిగించి అతడు కోరిన ధనమును ప్రభుత్వకోశాగారము నుండి తీసియిచ్చిరి.

అంతలో జర్మనులతని మీాదికెత్తివచ్చిరి. మొదట మోసముతో వారతని సేనయందు అయిదువేల మంది రౌతులను వధింపగలిగిరి. వెంటనే వారి మోసమును గ్రహించి సీజరు తన వ్యూహమును మార్చి నూతన విధాన మున తన సేనను సమీాకరించి వారి నెదుర్కొని పోరి వారి

నోడించెను. ఆ సమరమున జర్మనులు నాలుగులక్షల మంది వీరులను కోల్పోయిరి. అంతటితో తృప్తిపడక అతడు జర్మనులను తగువిధమున శిక్షింప నిశ్చయించి పదిరోజులలో రైను మీాద వారధిని నిర్మించి ఆ నదిని దాటి జర్మను దేశమున ప్రవేశించెను. అతని సేనల జూచి వెరగుపడి జర్మనులు తమ యిండ్లను వదిలి అడవులలో తలదాచుకొనిరి. సీజరు అచ్చట పదునెనిమిది దినములు గడిపి బ్రిటను నాక్రమింపబోయెను. నాటివరకును రోమనులకు ఆ దేశపు నిజస్థితి దురవగాహమైయుండెను. అట్టి నూతన దేశమును గూర్చి నెరగందక సీజరు పెద్ద నౌకా బలమును ద్ధము చేయించి అట్లాంటిక్ సముద్రమున పయనించి ఇంగ్లండు చేరి అచ్చటి రాజు నోడించి కప్పముగొని స్వదేశమునకు తిరిగివచ్చెను. కాని స్వదేశమున అతనికి కోరిన స్వాగతము లభింపలేదు. దానికి బదులు అతని యేకైక పుత్రిక మరణవార్త అతని చెవులబడెను.

అతడా దుఃఖమునుండి ఉపశమనమును పొందుటకు ముందే గాలులో తిరుగుబాటు చెలరేగిన వార్త అతని చెవులబడెను. వారు అరువది వేల సైన్యముతో తమ దేశమును పాలించుచుండిన సిసిరో సైన్యమును చుట్టివేసిరి. ఏడువేల మంది భటులతో సీజరు వారి నెదుర్కొనవలసివచ్చెను. చిన్నదగు యీా సేనను నిర్మూలించుటకు

పెద్ద యత్న మవసరముండదని తలచి గాలులు వెనుక ముందులు చూడక వచ్చి సీజరుపై బడిరి. సీజరు సేన అప్పు డొక యిరుకు ప్రదేశమున విడిసియుండెను. అది పెద్ద సేన నెదిరించి పోరుటకు చిన్న సేనకు అనుకూలమైన ప్రదేశము. ఆ యంశమును గుర్తింపజాలని గాలులను రోమను లతి సులభముగా ఓడించి తరిమికొట్టిరి. అంతలో చలికాలము వచ్చెను. మంచు కప్పబడి బాటలన్నియు మరుగున బడి పోయెను. నదులు గడ్డకట్టియుండెను. ఈ కష్టముల లెక్క చేయక గాలులకు గుణపాఠమును బోధింప నిశ్చయించి సీజరు రోము నుండి క్రొత్త సైన్యములను దెప్పించి దేశము మీదబడి యిచ్చవచ్చినట్లు విహరించుచు, కంటబడిన నగర ముల నాక్రమించుచు, లోబడిన వారి నాదరించుచు, ఎదురు తిరిగినవారిని శిక్షించుచు, అతడు సెక్వాని Sequani అను ప్రదేశమును చేరెను. శత్రువు లచ్చట అతని నెదుర్కొనిరి. ఈ యుద్ధమున అతని సేన ఆదిలో వెనుకంజ వైచినను చిట్ట చివరి గొప్ప విజయమును సాధింపగలిగెను. పిమ్మట నతడు అలేషియా Alesia నగరమును ముట్టడించెను. ఆ నగరమందలి దుర్గమతి బలిష్ఠమైనది. దానిని కాపాడ నిశ్చ యించి మూడులక్షల మంది వీరులు దానియందు నిలిచి యుండిరి. వారికి తోడ్పడ నిశ్చయించి లక్షా ఏబదివేల మంది గాలు లచ్చటికి వచ్చిరి. సీజరు ఒక్కనారి రెండు

సేనలతో రెండు సంగ్రామములయందు పోరవలసివచ్చెను. ఈ సమరమున సీజరు సాధించిన విజయమును గని గాలులేగాక రోమనులు సైతమచ్చెరు వందిరి. కోటలోబడి, కోటలోని స్త్రీల ఆక్రందనములు వినిపించువరకును రోమనులు ఆ యుద్ధమున తమది పై చేయిగా నున్నదని గ్రహింపజాలకపోయిరి. కోటలోని వారేగాక కోట వెలుపల నున్న వైరులు సైతమతి ఘోరముగా పోరి రోమనుల జయింపజాలక వారికి లోబడవలసివచ్చెను. గాలుల సేనా నాయకుడయిన వెర్జన్ టోరిక్ Vergentorix సీజరు చెంతకువచ్చి గుర్రము దిగి తన స్వర్ణకవచములను,స్వర్ణ శిరస్త్రాణమునుదీసి నేలపై బెట్టి సీజరు పాదములకడ మోకరిల్లి తన భక్తిని ప్రకటించెను. ఈ నగరమున వారికి లభించిన స్వర్ణరజిత కవచములు, శిరస్త్రాణములు, గొప్ప పనితనము గలిగిన ఖడ్గములు, భల్లములు అసంఖ్యాకముగా నుండెను

సీజరు పాంపేలు మొదట పదవుల సంపాదించుటకు ఒకరికొకరు తోడ్పడిరను పదవులు పొందిన పిదప ఒకరిని కూలద్రోయుట కొకరు యత్నింపదొడగిరి. వారిరువురికిని ప్రత్యర్థిగా నుండిన క్రాసస్ Craassus మరణించిన పిదప రోమక ప్రభుత్వము నందలి అత్యున్నత పదవులకిప్పుడు వారిరువురును పోటీపడదొడగిరి. సీజరును కూలద్రోయుట గొప్ప పని కాదని పాంపే తలచెను. సీజరట్లు గాక చిన్న సాము

నైనను పెద్ద కర్రతో కొట్టవలయునను సామెతను గుర్తించి పాంపేను అధిగమించుటకు తన శక్తి నంతయు ఉపయోగించి కృషిచేయ మొదలుబెట్టెను. గాలిక్ యుద్ధములతో దేశమున అతని ప్రతిష్ఠ ఆకసము నంటియుండెను. దానికి తోడు సెనెటర్ల అప్రజయోజకత్వము వలన రాజధాని నగరమున అరాజక పరిస్థితి యేర్పడియుండెను. ప్రజలు ఎన్నికల యెడ విసువుజెంది నిరంకుశపాలనము నభిలషించి చేయరాని దుండగముల చేయుచుండిరి. వారి దుండగముల నెదుర్కొనజాలక న్యాయాధిపతులు, కాన్సలులు (శాసన సభ్యులు) సెనెటరులు తమ పదవులను, నగరమును వదలి దూరభూములకు వెడలిపోయిరి. రోము నగరము తుపానులో జిక్కి, చుక్కానిని కోల్పోయిన నావవలె నుండెను. ఇట్టి అరాజక పరిస్థితియందు జిక్కుకొని యుండిన రోము నగరమున ససైనముగా ప్రవేశించి సీజరు కోశాగారమును తెరిపించి వలసిన ధనమును తీసికొని పాంపే నెదుర్కొన సంసిద్ధుడై నిలచెను. ఈ వార్త విని పాంపే నగరమున ప్రవేశింప వెరచి ఓడ యెక్కి విదేశములకు పారిపోయెను. సీజరు వెంటనే స్పెయిను దేశమున నున్న పాంపే అనుచరుల మీదికి తన సేనను నడిపించెను. ఇతని యత్నమును గనినంతనే వారు స్పెయిను దేశమును విడిచి పారిపోయిరి. అది జూచి ప్రజలు సీజరుకు నియంతృత్వాధికారము నిచ్చిరి.

ఈ పదవిని చేపట్టినంతనే సీజరు పూర్వము సిల్లాచేత శిక్షింపబడిన వారి శిక్షల నన్నిటిని రద్దు చేసెను. దేశ బహిష్కృతుల నెల్లను దేశమునకు పిలిపించి ఆదరించెను. ఋణబాధితులకు వడ్డీలు తీసివేయించి ఋణవిముక్తులగుటకు తోడ్పడెను. పిమ్మట నతడు తన సేనను తీసికొని పాంపే నెదుర్కొనుటకు బయలుదేరెను. ఆ సమయమున పాంపే పెద్దసేనను పోగుచేసియుండెను. సీజరు సేన చిన్నది. అయినను అతడు వెరగుపడలేదు. వారికి జరిగిన మొదటి యుద్ధమున పాంపేది పై చెయ్యి అయ్యెను. కాని ఆ సమయమున అతడు సీజరు సైన్యమును తరిమి నిర్మూలింపక విడిచి పుచ్చెను. అతని తెలివితక్కువ పనికి సంతసించి సీజరు తన సేనను వెంటబెట్టుకొని మాసిడోనియాకు బయలుదేరెను. దారిలో అతడు గోంఫి నాక్రమింపగా అతని కచ్చట కోరినంత ధనమేగాక మధువు సైతము లభ్యమయ్యెను. అతని సైనికుల కది అమృతమయ్యెను. అతని సేన అటనుండి నూతనోత్తేజముతో పయనించి ఫార్లియా Pharlia చేరెను. వారి కచ్చట పాంపే సైన్య మేదురయ్యెను డొమిటియస్ సిపియో మొదలగు వీరులు సీజరుసేన నచ్చట యెదుర్కొనుమని పాంపేను ప్రోత్సహించిరి. ఆ సమయమున అతనిచెంత నలుబదియైదువేల పదాతి సైన్యమును ఐదువేలమంది ఆశ్వికులునూ వుండిరి.

పరిస్థితులు ప్రతికూలముగా నుండినను పాంపే నెదుర్కొన నిశ్చయించి సీజరు దేవతలకు పూజలు చేయించెను. ఆ రేయి అతడు నిద్రింపలేదు. సేనా నివహమును పరిశీలించుటయందును సైనికులను ద్బోధించుట యందును ఉపసేనాపతులకు సమర రహస్యముల నెరుకపరుచుటయందును గడిపెను.

మరునాటి సూర్యోదయ సమయమున రోమక వీరులలో నగ్రగణ్యులని పేరు గాంచిన సేనాపతు లిరువురును ఒకరితో నొకరు తలపడ సంసిద్ధులై నిలచిరి. సీజరు తన సేనను మూడు భాగములుగా విభజించి కేంద్రమును కాల్వినస్ Calvinus కును వామపార్శ్వమును ఆన్టొనికి అప్పగించి దక్షిణ పార్శ్వాధిపత్యమును తాను గైకొని నిలచెను. పాంపే కేంద్రమును తన మామ కప్పగించి తాను సీజరు నెదుర్కొన నిశ్చయించి వామపార్శ్వాధిపత్యమును స్వీకరించెను.

సేన లొకదానినొకటి సమీపించినంతనే క్రిసీనియస్ అను ఉపసేనాపతి తన సేనతో పాంపేసేన మీదికి దూకెను. అతని రాకను జూచి పాంపే తన ఆశ్వికులను సీజరు సేన మీదికి పురికొల్పెను. క్షణములో పోరు ఘోరమయ్యెను. పాంపే సైన్యము పెద్దదిగా నుండియు సీజరు సైన్యము నెదుర్కొనని పోరజాలక వెనుకంజ వేయదొడగెను. సీజరు సేన అన్నిరంగములయందును చెలరేగి వైరుల నిర్మూలించుచుండెను. విజయము సన్నిహితమగుటజూచి పాంపే

తన అశ్వము నధిరోహించి చాటుగా పయనించి ఈజిప్టుకు పారిపోయెను. మరి కొన్ని క్షణములలో అతని భటులు రణరంగమును వదలి పారిపోయిరి. సీజరు రణరంగమందు అసువులబాసిన వారందరిని పరిశీలించిచూచెను. వారిలో రాజకీయ రంగమున తనకు ప్రత్యర్థులై నిలచి తన్ను అణగద్రొక్కుటకును, హత్య చేయుటకును యత్నించిన నాయకులనేకులు డిరి. వారిని జూచి "వీరికి నేను యెన్నియో ఉపకారములు కావించితిని. వానినన్నిటిని మరచి నాకు ద్రోహము తలపెట్టి చివరకు నాచేత యింతపని చేయించిరి. విధి విలాసము చిత్రమయినది." అని చింతించెను. పిమ్మట నతడా యుద్ధమున తనకు ఖైదీలుగా జిక్కిన వారిలో అనేకులను తన సైన్యములో చేర్చుకొనెను. అధికార పదవుల యందుండినవారిలో అనేకులను శిక్షింపక వదిలివేసెను. అట్లు క్షమాభిక్ష పొందినవారిలో (అతని హంతకులలో నొకడగు) బ్రూటస్ ముఖ్యుడై యుండెను.

అటు పిమ్మట సీజరు పాంపెను శిక్షింప నిశ్చయించి అలెగ్జాండ్రియా చేరెను. కాని అతడా నగరమును చేరుటకు ముందే హత్య గావింపబడెను.

సీజరు అచ్చట విడిదిచేసిన సమయముననే క్లియోపాత్ర అతని ధ్యానముచేసి తన ప్రజ్ఞావిశేషముచే అతనిని వశీకృతుని గావించుకొని తన కోర్కెలను తీర్చుకొనెను. ఈ

ఈజిప్టుకు మహారాజ్ఞియైన ఆమె చెలిమి లభించినదే గాని సీజరు కష్టము లంతము గాలేదు. ఈజిప్టుదేశపు రాజు (క్లియో పాత్ర భర్త) పెద్ద సేనతో అతనిసేనను చుట్టివేసెను. నేల మీద నిలచుటకు తావులేక సీజరు సేనలు పడవలెక్కి పోర వలసివచ్చెను. ఆ యుద్ధమున పాల్గొనిన ఈజిప్షియన్ సేన మిక్కిలి పెద్దది. సీజరు సైన్యము చిన్నది. ఈజిప్షియన్ సేనలు విశాల భూభాగమున నిలచి స్వేచ్ఛగా తిరుగుచూ పోరుచుండిరి. రోమనులు కాలుకదుపుటకు వీలుగాని యిరుకు ప్రదేశమున నిలచి పోరవలసివచ్చెను. అంతలో ఈజిప్షి యన్‌లు విసరిన దివిటీల వలన సీజరు నిలిచియుండిన నావ నిప్పు అంటుకొని కాలిపోవజొచ్చెను. ఆ నావలో ఉద్గ్రంధము లనేకము లుండెను. సైనికులు ఎవరికివారు నీటిలో దూకి ప్రాణరక్షణము గావించుకొనుచుండిరి. సీజరు దొరికిన గ్రంధములను కట్టగట్టి భుజమున దగిలించుకొని వైరులు ప్రయోగించు ఆయుధములబారినుండి తప్పుకొనుచు యీది అతి కష్టమున సురక్షిత స్థానమును జేరెను. కాని అతడీ యుద్ధమున పరాజితుడు కాలేదు. విజయలక్ష్మి మొదట కష్టపెట్టినను కడపట అతనినే వరించెను. ఈజిప్టు ప్రభువు ఏమయ్యెనో యెవరును చెప్పజాలకపోయిరి. యుద్ధము ముగిసిన పిదప సీజరు క్లియోపాత్రను ఈజిప్టు కధినేతగా పట్టముగట్టి, అటనుండి సిరియా పోయి, అచ్చట కొంత

కాలము గడపి సంవత్సరాంతమున ఇటలీ చేరెను. అతనిని ప్రజలచ్చట సయంతగా నెన్నుకొనరి.

అంతలో : అతని వైరులయిన కాటో, సిపియో అను వీరులు ఆఫ్రికా నుండి పెద్దసైన్యమును తీసికొని అతని మీదకెత్తివచ్చిరి. సీజరు వారి నెదుర్కొని పోరి చిత్తుగా ఓడించి పారద్రోలెను. ఆ యుద్ధమున అతనివైరులే బదివేల సైనికులను కోల్పోయిరి. అతని సైనికులే బదిమంది మాత్రము మరణించిరి.

యుద్ధము ముగిసిన వెంటనే సీజరు రోము నగరమును జేరి తన సైనికుల కందరికిని ఉదారమయిన బహుమతుల నిచ్చి ప్రజలకందరికి ఆనందదాయకములగు విందులు చేయించెను. ( ఆ విందున అతడు ఒక్కసారిగా ఇరువది వేల పీటలు వేయించి యిరువది వేలమంది అతిథులకు వడ్డీన చేయించెను. )

అంతలో పాంపే తనయులు పెద్దసేనతో అతని మీదికి వచ్చిరి. మండా అను ప్రదేశమున వారి నెదుర్కొని పోరి సీజరు అతి కష్టమున విజయమును సాధించగలిగెను. అతడు నేటివరకును చేసిన యుద్ధములలో విజయ సాధన మతని లక్ష్యముగా నుండెను. ఈ యుద్ధమున నతడు ప్రాణరక్షణ మును దృష్టిలోనుంచుకొని పోరవలసివచ్చెను. ఈ యుద్ధము

ముగిసిన పిదప అతడు రోముకు వచ్చి బ్రూటస్, కాషియ సులకు ఉన్నతోద్యోగము లిచ్చి గౌరవించెను. ప్రజలచే కూల్చి వేయబడిన పాంపే కాంస్య విగ్రహమును మరల నిలువబెట్టించెను. అతడిప్పుడు రోము నగరమునకు నియం తగా నెన్నుకొనబడియుండెను ఈ యున్నత పదవియందున్న అతనికి అంగరక్షకు లుండుట అత్యవసరమని మిత్రులు సూచించిరి. ప్రజల అనురాగము తప్ప వేరొక రక్షణమును తా నాశింపనని అతడు వారికి ప్రత్యుత్తరమిచ్చెను.

సీజరు పెక్కుయుద్ధములుచేసి పెక్కువిజయములుసాధించి యుండెను. కానివానితో అతడు తృప్తుడుకాలేదు. చేయదగిన ఘనకార్యములగూర్చి అతనిఊహాలు ఆకసమునంటుచుండెను ఘనకార్యములచేయగలిగినవాడు చేతులుగట్టుకొని కూర్చుం డునా? వానిని సాధింప నతడు విశ్రాంతి నాశింపక కృషి చేయ మొదలుబెట్టెను. దేశమున పంటభూములను బాగు చేయించెను. రేవు పట్టణముల నిర్మించుటకు పథకములు వేయించి ఇంజనీయరుల నియమించెను. ఇవిగాక యితడు అసాధారణ కార్యమగు టైబరు నది ప్రవాహ మార్గమును మరలించుటకు ప్లానులు వేయించెను. ఇతడు కావించిన పనులలో ముఖ్యముగా పేర్కొనదగినది పంచాంగ సంస్క రణము. అంతకుముందు అమలులోనుండిన పంచాంగము కాలమును సరిగా తెలుపజాలకుండెను. కాని యితడు

తయారు చేయించిన పంచాంగము శాస్త్రీబద్ధమై సరియగు కాలమును తెలుపగలిగియుండెను. దీనివలన ప్రజలకు శుభాశుభదినములను పర్వకాలములను సులభముగాగుర్తించుటకు వీలు కలిగెను.

అతని పనుల జూచి విరోధు లతనికి కిరీటధారణమున వాంఛ యున్నదని ప్రచారము గావింపదొడగిరి. ప్రజలలో కొందరా ప్రచారమును విశ్వసించిరి. అంతలో ఒకనాడతడు ఆల్బానుండి రోము నగరమునకు వచ్చుచుండ మార్గమున నెదురుపడిన ప్రజలలో నొక డతనిని 'రాజా' యని సంబోధించెను. రోమనులట్టి పదవిని గౌరవింపరని తెలిసిన సీజరు తనపేరు సీజరనియు తాను 'రాజు' కాదనియుచెప్పి తన గమ్యమును గూర్చి వెడలిపోయెను. కాని అతని మిత్రులలో కొందరతనికా పదవిని కట్టబెట్టవలెనని గాఢముగా వాంఛించుచుండిరి. వారిలో ఆంటోని ముఖ్యుడు. అతడొకనాడు సీజరు సభలో గూర్చుండియుండ అతని శిరమున కిరీటమును బెట్ట యత్నించెను. ఆ యత్నమునకు హర్షము ప్రకటించినవారు అల్పసంఖ్యాకులుగను, :సీజరు దానిని నిరాకరించినప్పుడు హర్షధ్వానముచేసిన వారిసంఖ్య అత్యధికముగను వుండెను.

ఏది యేమయినను విధి నిర్ణయమును మానవుడు తప్పింపకొనజాలడు. దేశమున దినమునకొక దుర్నిమిత్తము

గోచరించుచుండెను. వానిలో ముఖ్యమయినది సీజరు దేవతలకు బలియిచ్చిన పశువు దేహమున గుండెకాయ కనిపించకపోవుట రోమనుల దృష్టిలో యిది తిరుగులేని విపత్సూచన. సీజరు హత్యకు క్రిందటి దినమున అతని అర్ధాంగి కాల్పూర్ణియా కాంచిన స్వప్నము దానికి మించినది. ఆ రేయి ఆమెకు ఖండించిన పతి శిరమును ఒడిలో నుంచుకొని విలపించినట్లు కల వచ్చెను.

మరునాటి ఉదయమున నిద్రలేచి సీజరు సెనెటు భవనమునకు బోవ పయనమయ్యెను కాల్పూర్ణియా అతని కడ్డముపోయి "నీవు నేడు గడపదాటి యావలకుపోవలదు." అని బ్రతిమాలుకొనిచెప్పుచుండెను. అంతలో ఒకమిత్రుడు వచ్చి ఆమె మాటలు విని 'కలలో గన్నది యిలలో జరుగదను మాట వినలేదా. కలలకు వెరచు నాయకుని ప్రజలు గౌరవింతురా?' అని పలికి సీజరును సభాభవనమునకు తీసికొనిపోయెను. సీజరు వైరులచ్చటజేరి అతని రాక కెదురు చూచుచుండిరి. సీజరు పోయి తన పీఠమున కూర్చుండుటయే తడవుగా వారు అర్జీలను యిచ్చుటకను సాకుతో అతనిని చుట్టివేసిరి. టిల్లస్ Tillus అనువాడు సీజరును సమీపించి అతని అంగీని క్రిందికి జారలాగెను. అది వారి సంకేతము. వెంటనే కాస్కా అను యువకుడు బాకునెత్తి సీజరు వక్షమున బొడిచెను. ఆ బాకును లాగికొని సీజరు

అతనిమీదికి దూకెను. అంతలో మిగిలినవారు అందరును అతనిమీదికి దూకి తలకొక పోటు బొడిచిరి. వారిలో కడ పటివాడు బ్రూటస్. ఆ సమయమున అతని దేహమున్న దాకిన గాయములు యిరువది మూడని తరువాత లెక్కింప బడెను. ఆ ఘోరకృత్యమును జూచి వెరగుపడి సెనెటరులు పీఠముల నుండి లేచి వీథనిబడి పరుగిడదొడగిరి. వారిని జూచి భయపడి గృహస్థు లిండ్లతలుపులను, దుకాణదారులు దుకాణములను మూసికొని లోపల గూర్చుండిరి.

అట్లు పరుగిడు ప్రజల కలవరమును జూచి హంతకులు ధైర్యము బూని ఖడ్గములు దూసి బారులుదీరి నడచుచూ ప్రజాస్వాతంత్ర్యమును వాంఛించు వారందరును Capitol కాపిటోల్ కడ సమావేశము కండని అరచుచూ సాగిపోవ దొడగిరి. వారి ఆకారము లత్యంత భయంకరముగా నుండెను. అంతలో సీజరు వైరులందరును వారిచెంతకు వచ్చిరి. ఈ కలకలమును జూచి సీజరు మిత్రులు కలవర మంది మిత్రుల యిండ్లలో దాగి ప్రాణరక్షణము గావించు కొనిరి. మరునాడు సెనేటరు లందరును గూడి బ్రూటసుకు అతని మిత్రులకు ఉన్నత పదవులనొసగిరి. అంతలో సీజరు వ్రాసియుంచిన మరణశాసనము వెల్లడియయ్యెను. అందతడు రోమను ప్రజానీకమునకు పెక్కు ఉపకారములు తలపెట్టి యుండినట్లు స్పష్టపడెను. వా రా విషయమును గ్రహించు

నంతలో దహనసంస్కారములకు కొనిపోవబడుచున్న సీజరు మృతదేహము వారి కంటబడెను. దానిని జూచినంతనే ఉద్రిక్తులై ప్రజలు వాహకుల కడ్డముపోయి శవమును దింపించి చెంతనున్న యిండ్లలోజొరబడి కంటబడిన కుర్చీలు, బెంచీలు మొదలగు కలప సామానులను యీడ్చుకొని వచ్చి వీధిలో పేర్చి శవమును వానిపై నుంచి అగ్నిని సంధించిరి. శవము క్షణములో దగ్ధమైపోయెను. వెంటనే వారా చితియందు కాలుచున్న కొరువులను తీసికొని గిరగిర త్రిప్పుచూ ఆవేశపూరితులై 'సీజరును వధించిన హంతకుల చీల్చివేయుదుము' అని కేకలు పెట్టుచూ పరుగిడదొడగిరి. మొట్టమొదట వారి కంటబడిన దురదృష్టవంతుడు సిన్నా. ఒక్కసారిగా అందరునూ వాని మీదబడి గొంతు పిసికిచంపి దేహమందలి యే అవయవమున కా యవయవమును లాగి ఆవలబారవైచిరి. వారి రౌద్రాకారమునుజూచి వెరగుపడి బ్రూటస్, కాషియస్సులు నగరము వదలపారిపోయిరి.

సామ్రాజ్య రక్షణమునకు, తద్విస్తరణమునకు సీజరు కావించినకృషికి యశముదక్క అతనికేమియును మిగులలేదు. అతని వధకు ముఖ్యకారకుడగు కాషియను సీజరును వధించిన ఖడ్గముతోడనే పొడుచుకొని మరణించెను. సీజరు మరణించిన మాసము దినముల వరకును దినకరుడా నగరమున తన సహజ కాంతులతో ప్రకాశింపకుండుట ప్రజలు ప్రత్యక్షముగా గుర్తిం

చిరి. ఎండలులేక చేమ ఆరక సూర్యరశ్మిలేక ఆ యేడు వారి తోటలయందలిపండ్లు ఫలింపలేదు. ఒకనాడు ఏకాంతముగా పరుండి విమరించుచుండిన బ్రూటస్ ఎదుట ఒక అత్యున్న తాకారము నిలువబడెను. అది సీజరును పోలియుండెను. సందేహము నివారించుకొనగోరి బ్రూటస్ అ ఆకారమును జూచి 'ఎవరు నీవు?' అను ప్రశ్నించెను. 'ఫిలిప్పీ రణరంగమున గ్రహింతువు' అని చెప్పి ఆయాకార మదృశ్యమయ్యెను. మరల ఫిలిప్పీ రణరంగమున ఆ ఆకారము బ్రూటస్‌కు గోచరించెను. అతడు మరల 'ఎవరు నీవ' ని ప్రశ్నించెను 'రేపు కనుగొందువు' అని చెప్పి ఆ ఆకార మదృశ్యమయ్యెను. ఆ రణరంగమున బ్రూటసుకు అపజయము సంభవించెను. ఆ అవమానమును భరింపలేక అతడు శిబిరమును వదలి ఒక ఏకాంత ప్రదేశమునకుబోయి ఒక ఉన్నత ప్రదేశమున నిలువబడి కత్తితో పొడుచుకొని క్రిందబడి అసువుల బాసెను.

— o —

# ఫిలొపమన్

ఫిలొపమన్ చిన్నతనముననే తండ్రిని కోల్పోయెను. వెంటనే క్లియాండర్ అతని సంరక్షణ భారమునకు పూను కొనెను. ఫోనెక్స్ సంరక్షణమున అకిలేస్ ఎట్టి ఘనతను సంపాదించెనో క్లియాండర్ సంరక్షణమున ఫిలొపమన్ అట్టిఘనతను సంపాదించెను. విద్యాభ్యాసకాలమున గురువు లతని ప్రతిభను జూచి అతడు తనకేగాక గ్రీసుదేశమునకు సైతము గొప్పకీర్తిని గడింపగలడని వక్కాణించిరి. ఇతడు మరణించిన పిదప రోమక విద్వాంసులు గ్రీకు లనదగిన వారిలో నితడు కడపటివాడని వక్కాణించిరి. పాఠశాల యందున్న సమయమున అతడు గురువులు చెప్పిన విద్యల నన్నిటిని శ్రద్ధగా అభ్యసించెను. కాని అతని అభిమానము నెక్కుడుగా చూరగొనినది సైనికవిద్య. అశ్వారోహణము, ఖడ్గభల్ల ప్రయోగములు అతడు క్షుణ్ణముగా అభ్యసించెను. మల్లయుద్ధమున నతడు చిన్ననాటి నుండియు మేటియై యుండెను. మిత్రులతని నా విద్యనెక్కుడుగా అభ్యసింపు మని ప్రోత్సహించిరి. కాని క్రీడలను మల్లవిద్యను అభ్య

సించువారు నిరస విద్యయందు ప్రావీణ్యము పొందలేరు. దాని శిక్షణ వేరు - దీని శిక్షణ వేరు. క్రీడలను, మల్ల విద్యను అభ్యసించువారికి మంచి ఆహారము తగిన విశ్రాంతి ఉండవలెను. అతడు సర్వకార్యముల యందును కాలనియమ మును పాటింపవలెను. సైనిక జీవితమున కీ సూత్రములు వర్తింపవు. అతడు జీవితమున యే నియమము పాటించుట కును వీలుగాదు. ఆకలిని చంపుకొనవలెను. నిద్రను మాన వలెను. కష్టములకు వెనుదీయరాదు. ఈ కారణమున అతడు క్రీడలను వదలి కదనకళకు తన జీవితము నంకితము గావించెను.

విద్యాభ్యాసమును ముగించి యుద్ధములందు పాల్గొన మొదలిడిన పిమ్మట నతడు రణరంగమున అడుగిడుటకు మొదటివాడుగను దానినుండి తిరిగివచ్చుటయందు కడపటి వాడుగను లెక్కింపబడుచుండెను. యుద్ధములు లేని సమయ ములందతడు దేహము గట్టిపడుటకు పొలము పనులను తోట పనులను చేయును. శకటములుండియు పోవలసిన ప్రదేశ ములకు నడిచియే పోవును. చాపతప్పశయ్యక తడుమెత్తల నుపయోగింపడు. కోడి కూతతో నిద్రలేచును. కూలి వారితో సమముగా పనిపాటలు చేయును. పొలము పనులు లేని కాలమును గ్రంథ పఠనమున కుపయోగించును. వినో దము కొరకతడు గ్రంథములు చదవడు. అతడు చరిత్రలను

తత్వశాస్త్రి గ్రంధములను ఎక్కువగా చదువును. అతని అభిమానమును చూరగొనునది ఎవాన్ జెలస్ రచించిన కదన కళ. యుద్ధము లందతడు తనకు లభించిన ధనమును ధర్మ కార్యముల కుపయోగించును గాని తన ఆస్తిని పెంపు గావించుకొనుట కుపయోగింపడు. మానవు డభ్యసింపదగు విద్యలకు కదనకళ శిరోభూషణము వంటిదని అతడు వచించును.

అతని ముప్పది మూడవ ఏట అతడు నివసించు మొగలా పోలిస్ పట్టణముపై లాకేడెయ్ మనుల నాయకుడగు క్లియోమెనస్ తన అనుచరులతో అర్ధరాత్రి సమయమున దాడి సలిపి యిండ్లయందు జొరబడి ధనధాన్యముల దోపిడీ చేయ మొదలుపెట్టెను. స్త్రీల ఆక్రందన ధ్వనుల విని నిద్రలేచి ఫిలోపమన్ తన యిరుగుపొరుగుననుండు అఖేయనులను కూడగట్టుకొని పోరి లాకేడెయ్ మనులను పారద్రోలెను. వారిని ఊరి వెలుపలికి తరిమి తిరిగి వచ్చునప్పటికి అతని దేహమంతయు రక్తమున తడిసియుండెను.

లాకేడెయ్ మను లంతటితో నూరకుండక మరియొక దాడి సలిపిరి. అఖేయనులు వారిని సెల్లాషియా పర్వత సమీపమున నెదుర్కొనిరి. ఈ యుద్ధమున వీరికి సాయము గావించుటకు అంటిగోనస్ ప్రభువు తన ఇలీరియన్ భటులను వెంటబెట్టుకొని వచ్చెను. వారు సంగ్రామరంగమున మంచి

అనుభవము గలిగినవారు. కాని అఖేయను లానాటివరకును యుద్ధమనునట్టిదో యెరుగనివారై యుండిరి. అందుచే రాజు వారిని దూరముగా నిలిపి తనవెంట వచ్చిన ఇలీరియనుల సాయముతో లాకెడెమోనులనెదుర్కొని పోరాడదొడగెను. కదన కళయందు సాటిలేని ప్రజ్ఞగలిగిన లాకెడెమోనులు వారి నచిరకాలమున అడకత్తెర వ్యూహమున బంధించిరి. ఇలీరియనులకు పెద్ద ఆపద సంభవించెను. అది అదనపుసేన (Reserve army రిజర్వు దళము) యుద్ధమున ప్రవేశింపదగిన తరుణము. కాని రాజు నానతి మీరు వెరచి అఖేయనులు కదనరంగమున ప్రవేశింపజాలకుండిరి. అది వ్యర్థముచేయుటకు తగినకాలము కాదని నిశ్చయించి ఫిలొపమన్ తన అనుచరులను వెంటబెట్టుకొనిపోయి లాకెడెయ్‌మనుల పృష్ఠభాగమున దాకి పోరజొచ్చెను. వెంటనేవారు వెనుదిరిగి అఖేయనులతో పోరదొడగిరి. క్షణకాలములో యుద్ధరంగము భీభత్సరూపము దాల్చెను. అంతలో ఒక బల్లెమువచ్చి ఫిలొపమన్ ఊరుభాగమును దాకి పూర్తిగా లోపలికి దిగిపోయెను. దానిని లాగివేయుటకు చెంతనెవ్వరును కనిపింపకపోయిరి. ఫిలొపమన్ దానిని చూచుచూ కూర్చుండక అతి మూర్ఖముతో దానిని రెండు చేతులతో బట్టి విరిచివేసి ఆ రెండు ముక్కలను రెండుదిక్కుల పారవైచి ఖడ్గముగొని మిత్రుల ప్రోత్సహించుచు రుద్రరూపు

డయి పోరు గావింపదొడగెను. వెంటనే చెదరిపోయిన అఖే యనులు వచ్చి అతనిచెంతనిలచి పోరగొడగిరి. రాజు వీరి ఉత్సాహమును జూచి రిజర్వుదళమును సంగరమున నురుకు డని సంజ్ఞ జేసెను. అది చూచుటయే తడవుగా వారు వెనుక భాగమునుండి వైరుల దాకిరి. వారిని జూచి లాకేడెయ్ మనులు పారిపోయిరి. విజయలక్ష్మి అఖేయనులను వరించెను. వెంటనే ఆంటిగోనస్ ప్రభువు ఫిలొపమనును సమీపించి భుజము దట్టి అతడు గైకొనిన సమయోచిత నిర్ణయమును, ప్రదర్శించిన ధైర్యసాహసములను ప్రశంసించి "నీవు తప్పక గొప్ప సేనానివగుదువు. నా సేనయందు జేరుచో పెద్ద పదవినిత్తును" అని పలికెను. ఫిలొపమన్ తాను అఖేయనులను వదలి అన్యుల సేవింపజాలనని ప్రత్యుత్తరమిచ్చెను.

స్వదేశమును జేరినంతనే అఖేయను లతనిని తమ అశ్వసేనాపతిగా నెన్నుకొని అతని యానతి ననుసరించి నడువదొడగిరి. ఆనాటి అఖేయనులు యుద్ధానుభవశూన్యులై యుండిరి. అందుచే అతడు నగరమందలి యువకులనెల్లరను ప్రోగుజేసి వారికి అశ్వారోహణమునను, ఆయుధ ప్రయోగమున వలయుశిక్షణ యిచ్చి వారిని సంగ్రామ కుశలుల గావించెను. పిమ్మట పోటీలుపెట్టి వారికా విద్యలయందు ఉత్సాహము పురికొల్పెను. పౌరునకు మాతృదేశ రక్షణ

మునకు మించిన ధర్మము వేరొకటి లేదని యుద్బోధించి వారియందు దేశభక్తి బీజములు నాటెను.

అంతలో లారిసస్ నదీ తీరమున వారికి ఎటోలియనులతో పెద్దయుద్ధము సంభవించెను. ఆ యుద్ధమున వారి సేనాపతి డెమోఫాన్‌టస్ ఫిలొపమను నంతము గావించి కీర్తి సంపాదింపవలెనను ఆశతో అతని మీదికి దూకెను. అతడు తన వంక అడుగువేయుట జూచినంతనే ఫిలొపమన్ తన యీటెను గురిపెట్టి అతని మీద గట్టిగా విసరెను. ఆ దెబ్బతో అతడు నేలగూలి ప్రాణములు విడిచెను. సేనాపతి పాటును జూచి ఎటోలియనులు పారిపోయిరి. ఈ అఖండ విజయమునకు మెగలాపొలిసీ నందలి ప్రజలా బాలగోపాలమును ఫిలొపమనును ప్రశంసించిరి.

ఇతని శౌర్యసాహసములను ఉత్తమాశయములను జూచి చుట్టుప్రక్కల నగరములవారందరును అతనిని తమ నాయకునిగా నెన్నుకొనిరి. అతని అధికారము క్రమముగా పెలొపనిసస్ అంతటను వ్యాపించెను. అతనికి పెద్ద సైన్య మేర్పడెను. వెంటనే అతడు తన సైనిక శిక్షణమున కొన్ని సంస్కారణములను ప్రవేశపెట్టెను. నేటి దనుకనువారు చిన్న బల్లెములతోడను చిన్నడాలులతోడను పోరుచుండిరి. పెద్ద యుద్ధముల కవి చాలవని గుర్తించి అతడు వారికి దీర్ఘ భల్లములను విశాల ఫలకములను పట్టి పోరు గావించుట

నేర్పెను. మొదటనవి ఎత్తుటకే వారికి భారముగా కనిపిచెను. కాని కొంత అభ్యసించిన పిదప అవి వారికి తేలియైపోయెను. ఇతనిచెంత శిక్షణ పొందుటకు ముందు వారు యుద్ధమునకు పోవునపుడు వరుసలుదీరి నడచుట, అడుగులో అడుగు కలిపి నడచుట, బల్లెములను భుజములపై ఏటవాలుగా పట్టి డాలుకుడాలు అనునట్లు వరుసలలో ఒకటిగ కలిసి నిలువబడి వైరుల నెదుర్కొని పోరుట మొదలగు ప్రక్రియల నెరుగకుండిరి. యుద్ధమనినంతనే గుంపులు గుంపులుగా పోయి ఎవరికి వారు వైరులతో పోరుచుండిరి. అందువలన వైరులు వీరినతి సులభముగా జయింపగలుగుచుండిరి. ఇంతేగాక వ్యూహములు పన్నుట, రక్షణదళముల నిలిపి విపత్కాలములయందు వాడుకొనుట మొదలగు సంగరమర్మముల వారెరుగకుండిరి. ఫిలోపమన్ వారి సైనిక వ్యవస్థ యందలి యీలోపముల దిద్ది వారధిరోహించుటకు మేలిజాతి ఉన్నతాశ్వములను, ధరించుటకు సర్వాంగ కవచములను సమకూర్చి మాసిడోనియనుల ఫలాంక్సుదళ కదన విధానమందలి మర్మముల నన్నిటిని వారికి క్షుణ్ణముగా నేర్పెను. ఇతని నాయకత్వమును వడయుటకు ముందు ఆకీయనులు జీవితమును భోగ విలాసములయందు గడపుట కలవడియుండిరేగాని కష్టజీవనమునకు మాతృదేశ రక్షణ సేవకు వలయు క్రమశిక్షణమునకు వారలవడియుండలేదు.

మంచి భోజనముచేయుట, మంచి దుస్తులు ధరించుట గృహ ములను సుందరమైన ఉపకరణములతో అలంకరించుట మొదలగు కార్యములకు వారి జీవితములలవడియుండెను. అంతేగాని వ్యక్తి సౌఖ్యమును త్యాగముజేసి మాతృదేశ స్వాతంత్ర్య రక్షణమునకు జీవితము సంకితము గావించుట పౌరుని ప్రథమ కర్తవ్యమని వారు గుర్తింపలేదు. చీకటిలో గడిచిపోవుచున్న వారి జీవితములకు ఫిలాపమన్ వెలుగు బాటను జూపెను. అతని నాయకత్వమున వారు ఒకరితో నొకరు వంతులు వైచుకొని దేశముకొరకు పోరు ముందుకు వచ్చుచుండిరి. అతని ప్రబోధమున యువకుల జీవితములే గాక అంగడి వీధులు సైతము మారిపోయెను. ఇప్పుడు మొగలోపొలిస్ అంగడి వీధులలో పూర్వమెక్కుడుగా లభించు విలాస వస్తువులు అంతర్హితములై వాని స్థానమున రకరకముల ఆయుధములు కవచములు గుర్రపుజీనులు అమ్మ బడుచుండెను. స్త్రీలు సైతము పూల దండలు కట్టుట, పూసలు గుచ్చుట మొదలగు పనులను మానివైచి శిర స్త్రాణముల నలంకరించుట, కవచ ఫలకాదులకు రంగులు వేయుట మొదలగు పనులయందు నిమగ్నులగుచుండిరి. అవును! వెనుకవారు సోమరులు, నేడు వారు కార్య శూరులు! పూర్వకాలమున థెటిస్ స్వర్గమునుండి తెచ్చి యిచ్చిన ఆయుధముల జూచి అకిలెస్ ట్రాజను యుద్ధమున

నురుకుటకెట్లు వేగిరపడెనో అట్లు నేడు అకేయనులు తమ అంగళ్ళయందు అమ్మబడు ఆయుధముల జూచి తమ వైరుల మీాది కురుకుటకు వేగిరపడుచుండిరి.

ఆ కాలమున మకనిదాసను నియంతవారికి ప్రబల విరోధిగా నుండెను. అతడు పెలొపనిసస్ భూభాగము నంతటిని ఆక్రమింప నిశ్చయించి మాంటినే మీాద దాడి సల్పెను. ఫిలొపమన్ అతని నెదుర్కొన నిశ్చయించి తన సేనను వెంటబెట్టుకొని అతని సేనమీాదికి నడిచెను. సేన లొకదాని నొకటి ఎదుర్కొని నిలచెను. కిరాయి సేనను అగ్రభాగమునను అకేయనులను పృష్ఠభాగమునను నిలిపి ఫిలొపమన్ కదనమున కుపక్రమించెను. మకనిదాస్ తన సేనతో వారి అగ్రభాగమును దాకెను. వారిధాటికి నిలువ జాలక కిరాయి సేనలు వెనుకంజ వేసెను. మకనిదాస్ తన అశ్వికదళముతో వారిని తరుముకొని ముందుకుపోయెను. ఆ తరణమును గుర్తించి ఫిలొపమన్ తన అకేయను దళము లతో మకనిదాస్ పదాతిదళము పై బడి కొన్నిక్షణములలో వారిలో నాలుగు వేలమంది భటులను యమసదనమున కంపెను. మిగిలినవారు కాలికిబుద్ధిజెప్పి పరుగిడ దొడగిరి. దానింగని మకనిదాసువారినెదుర్కొనగోరి వెనుదిరిగి వచ్చు చుండెను. కంటబడినంతనే ఫిలొపమన్ అతనిని వధింప దలచెను. కాని అతడధిరోహించిన గుర్రము అత్యున్నత

మైన తనమెడయెత్తుకొనివచ్చుచుండ దానిచాటునగూర్చుం
డియున్న మకనిదాసతని కంటికి సరిగాకనుపింప కుండెను.
అత డంతనించుకయోచించి తనగుఱ్ఱము నొకప్రక్కకుద్రిప్పి
భల్ల మధ్యభాగమును పిడికిటబట్టి మకనిదాసును గురిపెట్టి
గట్టిగా విసరెను. అది అతివేగమునపోయి అతని డొక్కలో
గుచ్చుకొనెను. ఆ దెబ్బతో మకనిదాసు మార్గపార్శ్వమున
లోతుగానున్న గోతిలోబడి ప్రాణములు విడిచెను. అతని
అనుచరులు రణరంగమును వీడి పరుగిడిరి అకేయనులు
వారిని తరిమి చేజిక్కినవారిన నరికివేసిరి. ఈ విజయము
లభించిన వెంటనే అకేయనులు అసమాన కౌశలముతో
గుఱ్ఱమును ప్రక్కకు త్రిప్పి మకనిదాను మీద బల్లెమును
విసరుచున్న వైఖరిలో ఫిలొపమన్ కాంస్యవిగ్రహమును
జేయించి డెల్ఫిలో నిలిపిరి. ఈ యుద్ధము జరిగిన కొలది
దినములకు వారి దేశమున నిమియన్ క్రీడలు జరుపబడెను.
ఆ క్రీడలయందు ఫిలొపమను సైనికులు కావించిన సైనిక
విన్యాసముల జూచి గ్రీకులందరును హర్ష ధ్వానములు గావిం
చిరి. దేశమందలి కవులు గీతములు రచించి వారి యశమును
కీర్తించిచిరి. ఆ క్రీడలయందు వారు ప్రదర్శించిన ప్రతిభను
జూచి లాకేడెయ్మనులు వారి నికతాము జయింపజాలమని
నిశ్చయించి నూటయిరువది టాలెంటుల రజతమును దెచ్చి
దానిని గైకొని తమతో వైరమును మాని సఖ్యము గలిగి

యుండుడని అర్థించిరి. ఫిలొపమన్ వారి సౌహార్ద్రమును దప్ప వారి ధనమును తా నాశించుట లేదని చెప్పి వారి ధనమును వారికిచ్చివేసెను. అతని ఔదార్యమును వేనోళ్ళ పొగడుచూ వారు తమ దేశమునకు తిరిగిపోయింది.

యుద్ధములు చేసి చేసి ఫిలొపమన్ తలపండిపోయెను. అతనికి డెబ్బది సంవత్సరములు నిండెను. అతడు తన చరమ కాలమును శాంతముగా గడిపివేయ నిశ్చయించుకొనెను. కాని దేవుడతనికా యవకాశము నొసగలేదు. అతడు వ్యాధి గ్రహస్థుడై మంచమెక్కియుండెనని విని వారి (అకేయనుల) చిరకాల వైరియగు డినొక్రేట్స్ వారి నగరము మీదికెత్తి వచ్చెను. ఆవార్త విని తాను జ్వరపీడితుడననుమాటమరచి అశ్వారూఢుడై సేననువెంటబెట్టుకొని వారినెదుర్కొనబోయె ను. ఇవాండర్ పర్వతపాదమున రెండుసేనలును తలపడెను. ప్రొద్దువాటవాలు సమయమునకు అఖేయనులది పైచెయ్యి అయ్యెను. అంతలో డినొక్రేట్సుకు క్రొత్తసేనలు వచ్చెను. పోరిపోరి అలసియున్న అఖేయనులు వారినెదుర్కొనజాలకుం డిరి. వారికి తిరోగమనముగావింపనానతిచ్చి అంగరక్షక దళముతో ఫిరోపమన్ వైరుల నెదుర్కొని పోరదొడగెను. పొద్దుగుంకు సమయమున చిన్నదగు అతని దళమును శత్రువులు నలుమూలలనుండియు చుట్టుముట్టి ఆయుధ ములు ప్రయోగించిరి. ఒక ఆయుధము వచ్చి ఆయువృ

పట్టునదాక ఫిలొపమన్ స్పృహతప్పి నేలపై బడిపోయెను వైరు లతనిని పట్టుకొని తమ నగరమునకు తీసికొనిపోయిరి స్పృహ వచ్చునప్పటికి తాను చెరసాల యందుంటినని ఫిలొపమన్ తెలిసికొనెను. అతడు జీవించియుండ అకేయనులను తాను జయింపజాలనని తలచి డినోక్రేటస్ ఫిలొపమనుకు మరణశిక్ష విధించెను. వెంటనే దూతయొకడు విషమునించిన పాత్రను గొనిపోయి అతనికిచ్చి రాజాజ్ఞను దెల్పెను.

ఫిరొపమన్ అతనిని జూచి "అకేయనులు మీకు పట్టుబడిరా, పారిపోయిరా?" అని ప్రశ్నించెను "నీవు దప్ప అకేయను లెవ్వరును మాకు పట్టుబడలేదు" అని అతడు ప్రత్యుత్తరమిచ్చెను. "అమ్మయ్య, నా శ్రమ ఫలించినది. నేనిక చింతింపవలసిన పనిలేదు. నిశ్చింతగా ప్రాణములు విడువవచ్చును." అని చెప్పుచు అతడు పాత్ర యందలి విషమును ఒక్క గ్రుక్కతో త్రాగివైచెను. వృద్ధుడు, వ్యాధిగ్రస్తుడునగు అతడు కొన్ని క్షణములలో ఆ విష ప్రభావమున విగతజీవుడై నేలకొరిగెను.

సురక్షితముగా స్వస్థానమును జేరిన అకేయనులా దినమున తమ నాయకుడు బంధితుడయ్యెనను వార్త విని, అందరును గూడి యోచించి మెస్సేనా మీద దాడి చేసిరి. ఉగ్రాకారులై వచ్చిన ఆ అకేయనుల నెదుర్కొన వెరచి మెస్సేనియను లిండ్లయందు దాగిరి. కాని అకేయనులు

వారిని వదిలిపెట్టలేదు. మొదట వారు నాయకుల నేరి బాధించిరి. పిమ్మట నగరమందలి గృహముల నన్నిటిని యిచ్చవచ్చినట్లు దోచి కంటబడిన మన్సేనియనుల నెల్లరను నరికివేసిరి. వీరి రౌద్రాకారమును జూచి వీరి నెదుర్కొన వెరచి రాజు సకుటుంబముగా ఆత్మహత్య గావించుకొనెను. పిమ్మట తమ్మడ్డగించువారు లేకుండుట జూచి అకేయనులు తమ నాయకుని వెదకికొనుచు చెరసాలయందు ప్రవేశించిరి. ఫలోపమన్ అసువుల బాసి అందు నేలపై బడియుండెను అతనిని జూచినంతనే వారి ఉత్సాహము ఉద్రేకము ఒక్క సారిగా నశించెను. ఆయన సజీవుడై లభించునని వా రాసించిరి. విగతజీవుడై అతడు వారి కంటబడెను. తమ ప్రియతమ నాయకుని మృతకళేబరమును జూచినంతనే దుఃఖ మును పట్టజాలక వారు పెద్దగా విలపింప మొదలుపెట్టిరి. బాష్పధారలతో వారి వదనములు మలినములయ్యెను. ఎంత యత్నించినను ఆగక పొరలివచ్చుచున్న దుఃఖమును పట్టజాలక వారు బిగ్గరగా విలపించిరి ఎంత విలపించినను ప్రయోజన మేమియుండును! పోయిన ప్రాణములు తిరిగి వచ్చునా? వారికి నాయకత్వమును వహించిన లెకోర్టాస్ వారి నోదార్చి ఫిలోపమన్ మృతదేహమును దహనము చేయించి అతని అస్తికల నొక స్వర్ణపాత్రమున కెత్తించి సైని కులను వెంటబెట్టుకొని తమ నగరమును జేర బయలుదేరెను.

అది విజయోత్సవము కాదు. శవోత్సవము గాదు. వారు తమ బలపరాక్రమాధిక్యతను గావించిన విజయమునకు చిహ్నముగా పూలమాలలు శిరమున ధరించిరి. కాని యెడ తెగక స్రవించు బాష్పములతో వారి వదనములు మలినమై యుండెను. ఆ ఉత్సవమున వారు జయ జయ ధ్వానములు గావింపరు. ప్రియతమ నాయకుని కోల్పోయితిమని రోదనము చేయరు. సేనాపతి లైకోర్టాస్ అనుజుడు పాలీబియస్ Polibius అస్థికల పాత్ర శిరమున నిడుకొని ముందు నడచెను. అతని కిరువంకలను ఖడ్గములనెత్తి పట్టుకొని పూర్ణ కవచములధరించి యిరువురు సేనాపతులు ఉత్తమాశ్వముల నధిరోహించి వచ్చుచుండిరి. విషాద గంభీర భావములచే మిళితమైన ఆ యుత్సవము మెగలాపొలిస్ నగరమును సమీపించునప్పటికి పౌరు లందరును స్త్రీలు, పురుషులు, పిల్లలు, పెద్దలు అతి దీనముగా విలపించుచూ వచ్చి ఆ యుత్సవమున పాల్గొనిరి. ఒక్క మెగలాపొలిస్ పౌరులే గాక ఆ వార్త వినిన సమీప గ్రామములవారు సైతము వచ్చి పాలీబియస్ శిరమున నున్న అస్థికలపాత్రకు నమస్కరించి తమ భక్తిని ప్రకటించుచుండిరి. ఆ జనసమూహమున ఎవరికంట జూచినను బాష్పప్రవాహములే గోచరించుచుండెను. అతని మరణమున తమ దేశపు ఘనతయే అంతరించినట్లు వారు భావించుచుండిరి. ఇట్లు అతి భక్తితో

వారా అస్తికల గొనిపోయి భూగర్భమున నిక్షిప్తము గావించి వానిపై ఘనమైన సమాధిని నిర్మించిరి. దేశ మందలి కవులందరును అతని ఘనతను కీర్తించుచూ గీత ములు రచించి ప్రకటించిరి. గ్రీసు దేశమందలి నగరము లన్నిటియందును అతని శిలా విగ్రహములు వెలసెను.

తరువాత కొంతకాలమునకు రోమనులు గ్రీసు దేశము నాక్రమించి నగరము లన్నిటియందును వెలసియున్న అతని విగ్రహములను జూచి అతని రూపమును జూచుచుండునంత కాలమును గ్రీకులు తమకు విధేయులై యుండజాలరని భావించి అతని విగ్రహముల తొలగింపదలచిరి. కాని వారి యందలి పెద్దలు అది ఉచితమైన పనిగాదని చెప్పినందున వారా యుద్యమము నుండి విరమించిరి. ఫిలొపమన్ భౌతిక కాయము నశించెనుగాని అతని ఉన్నతాశయములు ప్రపంచ మంతటను వ్యాపించెను.

— o —

# ఆల్సిబియాడెస్

ప్రపంచమున జన్మించిన అద్భుతవ్యక్తులలో ఆల్సి బియాడెస్ ఒకడు. ఇతని తల్లి డినోమాకె. తండ్రి క్లినియాస్. చిన్నతనముననే తండ్రి చనిపోవుట వలన పెరిక్లిస్ యితని సంరక్షణభారమును బూని అమిక్లా అను స్పార్టాను దాదికితని నప్పజెప్పెను. (ఆ కాలమున బిడ్డలను పోషించుట యందు స్పార్టాను దాదులు గొప్ప ప్రఖ్యాతిని పడసి యుండిరి) యుక్తవయస్కుడైన పిదప నితడు జోఫిరస్ అను విద్వాంసుని చెంత విద్య నభ్యసించెనని ప్లేటో రచనల వలన మనకు తెలియుచున్నది. మిత్రుల వలన యితనికి సుగుణములతో పాటు కొన్ని దుర్గుణములు పట్టుబడెను. అందు ముఖ్యముగా పేర్కొనదగినది అతిశయము. అన్ని అంశముల యందును అందరికన్నను మిన్నగా నుండవలెనను ఆశయము అతనికి చిన్ననాడే పట్టుబడెను. ఈ ఆశయ సాఫల్యమున కుపకరించు అంశములలో మొదటిది దేవుడితనికిచ్చిన సుందరాకారము. బాల్యమున ఒక విధముగను,

యౌవనమున వేరొక విధమునను, కౌమారమున మరియొక
తెరగునను అతని యాకారము చూపరుల నాకర్షింపగలిగి
యుండెను. అతని సుగుణములలో రెండవది శరీరపాటవము.
ఆటపాటలలో ఆనాడు అతనిని మీరగలిగినవాడు ఎక్కడనూ
లేకుండెను. అతని శరీరబలమునకు బుద్ధిబలము తోడయ్యెను.
అతని వాక్పాటవము దానికి వన్నె పెట్టెను. అతని ఉపన్యాస
ములకు శ్రోతలు ముగ్ధులగుచుండిరి. అతనికి కొద్దిగా నత్తి
యుండెను అది అతని ప్రసంగముల కవరోధము కలిగించు
టకు బదులు ఒక వింత సొబగును చేకూర్చుచుండెను. ఏ
భావమును ప్రకటించుటకు ఏ పద ముచితమైనదో అతనికి
తెలిసినట్లు మరి ఎవ్వరికిని తెలియదు. అతని ఉపన్యాసము
లందు వ్యర్థ పదమెంత మెంత వెదకినను కనిపించదు. ఈ
సుగుణములకు తోడితనికి అసాధారణమగు కదన కౌశల
మబ్బెను. బాణప్రయోగమున, భల్లప్రయోగమున, అశ్వా
రోహణమున అతని కతడే సాటియైయుండెను. విద్యాభ్యాస
కాలమున అతడేనాడును గురువుల మాట మీరలేదు. కాని
పిల్లన గ్రోవివాద్యము నభ్యసించు అంశమున నితడు
గురువు నాజ్ఞ పాటింప తిరస్కరించెను. దాని నూదుటకు
చెక్కిళ్ళు పూరించినపుడు వదనము వికృతముగా కనిపించును
గాన దానిని తా నభ్యసింపననెను. అతనిని జూచి తోడి
విద్యార్థులు సైతము దానిని మాని హార్పును, లయరును
అభ్యసింపబూనిరి.

ఇతడిట్లు ఆ కాలపు గొప్పయిండ్ల బిడ్డలు దీక్షతో అభ్యసించు విద్యలన్నిటిలో పై చేయియై యుండుటయేగాక అనంతమగు సంపదలుగలిగి మిత్రులను సంతోషపెట్టుటకు ముందు వెనుకలు చూడక ధనము వెచ్చించుచుండుటచే యువకులందరును ఇతని చెంతజేరి భోగములందు, విలాసములందు కాలము గడుపుట కతనిని ప్రోత్సహించుచుండిరి. ఆ సమయమున నితడు సోక్రటీస్ కంటబడెను. అతడీ యువకుని తన చెంతకు దీసికొని భోగవిలాసములందు కాలము గడుపుట మానవజీవిత పరమార్థము కాదనియు, దాని లక్ష్యము వేరుగా నున్నదనియు బోధించి చెప్పెను. ఆ మాట లా యువకుని హృదయమున గాటముగా నాటుకొనెను. నాటినుండియు అతడు యువకుల వెంట తిరుగుట మాని తన జీవితమున అధికకాలము సోక్రటీస్ చెంత గడుపదొడగెను.

ఒకనాడొక సంపన్న యువకుడు విందుజేసి దానికతని నాహ్వానించెను. సోక్రటీసుకు వెరచి ఇతడు దానికి దూరముగా నుండెను. నగరమందలి సంపన్న యువకు లందరు అచ్చట చేరిరి. గాన నాట్యములతోడను, మధుపానము తోడను వారు ఒడలు మరచియుండిరి. ఆ మార్గమున బోవుచు ఆల్సిబియాడెస్ వారి స్థితినిజూచి, భవనమున ప్రవేశించి చేతికందిన స్వర్ణరజత పాత్రలను చేకొని మెల్లగా

నడచిపోవుచుండెను. అచ్చటి యువకులతని దౌష్ట్యమును జూచి, కినిసి, అతనిని శిక్షింప నిశ్చయించి అతని వెంట పరువిడిరి. ఆన్థెమియోన్ వారిని జూచి - "ఇచ్చటనున్న పాత్రలనన్నిటినిగొని పోవవలసినవాడు కొన్నిటిసమాత్రమే కొనిపోవుచుండుట జూచి సంతసింపక వానిని దండింప యత్నింతురా? ఆనందముతో గడపవలసిన కాలమును పనికిమాలిన పాత్రలకొరకు వ్యర్థము గావింతురేల? పాత్రలను వదలి వినోదకార్యక్రమముల గూర్చి యోచింపుడు." అని పలికి వారి నా యుద్యమమునుండి మరలించెను.

బాల్యము గడచి యౌవనమున నడుగిడి ఉన్నత విద్య నభ్యసించుకాలమున నితడు తన యుపాధ్యాయుని జూచి "మీరు నాకు హోమరును బోధింపరేల?" అని ప్రశ్నించెను. ఆ ఉపాధ్యాయుడు హోమరు గ్రంథములు తనచెంత లేవని చెప్పగా హోమరును బోధింపని ఉపాధ్యాయుని చెంత తా నభ్యసింపదగినదేమియును వుండదనిచెప్పి యతడు మరియొక ఉపాధ్యాయు నాశ్రయించెను.

అంతలో అథేనియనులకు పోటిడే Potidaea తో కలహము సంభవించెను. ఆ సమరమున ఆల్సిబియాడెస్ అవక్ర పరాక్రమముతో వైరి వ్యూహమున జొచ్చిపోరు చుండ, అథేనియను లెవ్వరును అతనివెంట వ్యూహమున ప్రవేశింపజాలనందున వైరు లతని చుట్టుముట్టిరి. ఇతడు

ప్రమాదమున జిక్కుటజూచి సోక్రటీస్ ప్రాణములకు తెగించి ఆ వ్యూహమున ప్రవేశించి పోజొచ్చెను. పారిపోయిన సైనికులు తిరిగివచ్చి వారికి తోడ్పడిరి. వైరులు వారి ముందు నిలువజాలక కాలికి బుద్ధిచెప్పి పారిపోయిరి. విజయలక్ష్మి అథీనియనులను వరించెను. ఈ విజయమునకు కర్త సోక్రటీస్ అని నిర్ణయించి అథీనియనులతనిని బహూకరింప దలచిరి. కాని వైరి వ్యూహమును ఛేదించినవాడే ఆ బహుమానమునకర్హుడని చెప్పి అతడా బహుమానమును ఆల్సిబియాడెస్ కు యిప్పించెను.

తరువాత కొన్ని దినములకు ఆల్సిబియాడెస్ కు కాలియాస్ అను యువకునితో కలహము సంభవించెను. ఆ కలహమున ఒడలు తెలియని కోపముతో నితడు కాలియాస్ చెంపమీద బలమైన దెబ్బకొట్టెను. చేయునదిలేక కాలియాస్ తలవంచుకొని యింటికి బోయెను. ఆల్సిబియాడెస్ యింటికి బోయి కలహకారణమును గూర్చి యోచించి, తాను తప్పు చేసితినని తెలిసికొని, మరునాడుదయముననే లేచి కాలియాస్ యింటికి బోయి, తన చేతనున్న దండము నతనికిచ్చి, అతని యిచ్చవచ్చినట్లు తన్ను శిక్షింపుమని వేడుకొనెను. అతని పశ్చాత్తాపమునకు సంతసించి కాలియాస్ తనతో బుట్టిన హిప్పారేటను (Hipparate) అతనికిచ్చి పది టాలెంటుల స్వర్ణమును కట్నముగా నిచ్చి వివాహము

గావించెను. కొంతకాలము వారి జీవితము సుఖముగా గడిచెను. కాని కాలక్రమమున ఆల్సిబియాడెస్ వేశ్యల పొందుగోరి తన్నాదరించుటలేదని ఆమె అతనికడ విడాకుల గోన నిశ్చయించి న్యాయాధిపతుల కడకు బోయెను. ఆ వార్త విని, ఆల్సిబియాడెస్ వెనుక ముందులు చూడక న్యాయస్థానమునకు బోయి, అచ్చట దీనవదనయై నిలిచి యుండిన తన అర్ధాంగిని ఒక్క యుదుటున భుజముననెత్తు కొని, తన యింటికి దీసికొనిపోయెను. పిమ్మట కొంతకాల మామె అతనితో సుఖముగా జీవితము గడిపెను గాని ఆమె ఎక్కువకాలము జీవింపలేదు.

ఆల్సిబియాడెస్ దేశమందలి ధనికులలో అగ్రగణ్యు డగుటయే గాక ఆ ధనమును ఖర్చుపెట్టుట యందు సైత మగ్రగణ్యుడై యుండెను. అతని నాశ్రయించువారెన్నడును రిక్తహస్తములతో తిరిగిపోవరు. అతనికున్నన్ని రథములు గాని అశ్వములుగాని దేశమున నెవ్వరికిని లేవు. ఒలింపిక్ క్రీడలకు (పందెములకు) యేడు రథములను అతడు తప్ప అంతకుముందు మరి యెవ్వరును పంపియుండలేదు. ఏడు రథములను పంపుటయేకాదు. మొదటి మూడు బహుమతు లను పొందిన వాడసలే లేడు. అతడట్లు మూడు బహుమ తులు పొందిన వార్త వినినంతనే జగద్విఖ్యాత కవియగు యురిపిడీస్ క్రింది గీతమును రచించి అతనిని కీర్తించెను.

"......... but my song to you,
Son of clinias, is due
Victory is noble, how much more
To do as never greek before
To obtain in the great ehariot race
The first, the second, and the third place
With easy step advanced to fame
To bid the herald three times claim
The olive for one victor's name"

ఈ విజయమును పొందిన సమయమున ఇఫేషియనులు ఖియోస్ వాసులు, లెస్బియనులు మొదలగు వారనేకులు అతనిని అనేక విధముల గౌరవించిరి.

యౌవనము దాటిన వెంటనే అతడు రాజకీయములందు అడుగుపెట్టెను. ఈ రంగమున నిసియాస్, ఫేయక్స్ అను యిరువురు ప్రత్యర్థుల నతఁ డెదుర్కొన వలసివచ్చెను. నిసియాస్ అతని కన్నను వయసున పెద్దవాడుగా నుండి అథేనియన్ సేనలకు అగ్రనాయకుడుగా నుండెను. అతనికి లాసెడెమోనియనులతో వైరమనిన గిట్టదు. వారితో నెన్నడును కలహింపరాదని అతడు ప్రజలకు బోధించుచుండెను లాసెడెమోనియనులకు గుణపాఠము బోధింపకున్న తమ దేశమే నాటికిని అభివృద్ధి పొందజాలదని అల్సిబియాడెస్

వాదించెను ప్రజలతని మాటల నామోదించి సైన్యాధిపత్యము నతనికి కట్టబెట్టిరి. ఆ పదవిని చేపట్టిన వెంటనే అతడు అథేనియనులను, ఆర్గీవులను, ఇలియనులను కలిపి ఒక కూటమిని సిద్ధము గావించెను. వారి సేనలన్నియు కలసి ఆర్గోస్ చెంత లాసెడెమోనియనుల నెదుర్కొని పోరి విజయము సాధించి ఆర్గోస్ నాక్రమించెను. అటు పిమ్మట ఆల్సిబియాడెస్ తన వాచానైపుణ్యమును జూపి పత్రేనగర వాసులను తమ పక్షమునకు త్రిప్పుకొనెను. ఈ విజయములను జూచి అథేనియను లతని నాకసమునకెత్తి గౌరవించిరి. వారి ప్రశంసల కుబ్బి యతడు మధుపానము తోడను భోగవిలాసములతోడను కాలముగడప మొదలుబెట్టెను అతని విలాస జీవితమును చూచి పౌరులలో కొందరతని యెడ యీర్ష్య బూని ద్వేషింప మొదలుబెట్టిరి. కాని అతని మధుర భాషణములను, సంగరరంగమున అతడు ప్రదర్శించిన అసాధారణ ప్రజ్ఞను జూచి సాధారణ ప్రజలు అతనికి భృత్యానుభృత్యులై మెలగుచుండిరి. అతడు వారి దృష్టిలోసింహము. అతడేమి చేసినను వారు దోషముగా పరిగణింపరు.

అంతలో అథేనియనుల దృష్టి సిసిలీమీదికి మరలెను. పెరిక్లిస్నాడే వారు దాని నాక్రమింప యత్నించిరి. కాని అప్పుడు వారి కాపని సాధ్యముకాలేదు. ఆ కోర్కె నేడు మరల చిగురించెను. వారి కోర్కెను మన్నించి ఆ దేశమును

జయింప నిశ్చయించి ఆల్సిబియాడెస్ పెద్ద నౌకా బలమును సిద్ధము గావించెను. కాని వారతని హితవచనముల పెడ చెవినిబెట్టిరి. అందుచే అతడు విధిలేక ఆల్సిబియాడెసుకు సహాయసేనాపతిగా దండయాత్రయందు పాల్గొనవలసివచ్చెను. దండయాత్ర ప్రారంభమైనంతనే దుశ్శకునములు పొడగట్టెను. కాని వానిని లెక్కచేయక వారు తమ దండయాత్ర సాగించిరి. ఆ దండయాత్రలో ఆరువేలమంది సైనికులును నూటనలు బది నౌకలును పాల్గొనెను.

వారు మొట్టమొదట ఇటలీతీరమును దాటి కటానాను ఆక్రమించిరి. అంతలో ఆల్సిబియాడెస్ ఏథేన్సుకు తిరిగి పోవలసివచ్చెను.

అథేనియనులలో కొందరతడు దేవతల కపచారము కావించెనను నేరము మోపిరి. అందుచే పురపాలక సభవా రతనిని స్వదేశమునకు రమ్మని ఆదేశించిరి. కటానాయందు అతనికీ విషయము తెలియదు. తురీ చేరునప్పటికీ విషయము తెలిసెను. తన వైరులు తన్ను శిక్షించుటకు తన మీద యీ నేరము మోపిరి. వారి చేతులకు తాను చిక్కరాదు అని తలచి అతడు మారువేషముతో పడవనుండి తప్పించుకొని నగరమున ప్రవేశించి అంతర్హితుడై పోయెను. కాని అతనికి శిక్ష తప్పలేదు. పురపాలక సభవారు అతనిని దోషిగా నిర్ణయించి అతని యిండ్లను భూములను వశపరచు

కొనిరి. ఆల్సిబియాడెస్ ఆ వార్త విని వారికి బుద్ధిచెప్ప నిశ్చయించి తన కాశ్రయమిచ్చునెడ, తానువారికి సాయము చేయుదునని, స్పార్టానులకడకు దూతల నంపెను. స్పార్టానులతని కోర్కెను మన్నించి అతని కాశ్రయమిచ్చిరి. ఆ దేశము చేరి అతడు సిసిలీపై దాడిచేసిన అథీనియనులనట నుండి పారద్రోలుటకును, ఏథెన్సుమీద దాడి చేయుటకు వారిని ప్రోత్సహించెను. అంతటితో తృప్తిపడక అతడు వారికి డెసెలియా నాక్రమింప తోడ్పడెను. ఈ నగరమును కోల్పోవుటవలన అథేనియనులకు ఆహార పదార్థములకు కొరత సంభవించెను.

ఇతని వలన గలిగిన లాభములను జూచి స్పార్టానులితనిని మిక్కిలి గౌరవింపదొడగిరి. వారు యితని వలన తమకు గలిగిన లాభములను జూచియేగాక అతని నడవడిని జూచి అంతకన్నను యెక్కువగా గౌరవింపదొడగిరి. స్పార్టాలో అడుగిడి నంతనే అతడు తన పూర్వజీవిత విధానమునకు స్వస్తిచెప్పి స్పార్టాను జీవితవిధానము ననుసరించి దీర్ఘ కేశములను పొట్టిగా కత్తిరించుకొనెను. ఉష్ణోదక స్నానము మాని శీతలోదక స్నానము చేయుటయేగాక రుచి పచిలేని నల్ల పులుసుతోగూడిన వారి ఆహారమును భుజింపదొడగెను. అతని యీ జీవిత విధానమును జూచి ఏథేన్సులో అతడు మిక్కిలి భోగపురుషుడై జీవించెడివాడని స్పార్టాను లూహింప

జాలకుండిరి. తోడి మానవుల ఆదరమును సంపాదించుటకు పరిసరములకు తగిన రీతిని జీవితవిధానమును మార్చుకొ గలిగిన నేర్పు అతనికి గలదని వారికి తెలియదు. ఊసరవి తన వర్ణముల నిచ్చవచ్చినట్లు మార్చుకొని కోరిన వర్ణము పొందగలదు. కాని అది స్వయముగా శ్వేతవర్ణము కాని ఆల్సిబియాడెస్ అట్లుగాక తన జీవితమునెట్లు కోరి అట్లు మార్చుకొనగలడు. స్పార్టాలో అతడు విడువక దేహ పరిశ్రమ కావించుచు, మితవ్యయముతో, మితభాషిగ కాలము గడపగలడు. అయోనియాలో భోగభాగ్యములతో తులదూగుచూ కాలము గడపగలడు, పర్షియన్ సామ్రాజ్య ములో పర్షియనులను మించిన ఆడంబర జీవితమును గడప గలడు. థ్రేసులో దినమంతయు మధుపానమున గడపగలడు థెస్సాలేలో గుర్రమును దిగనే దిగడు. ఏ దేశపు ప్రజలకే యిష్టమో దాని నతడు వారికన్నను మిన్నగా చేయగలడు స్పార్టాలో అతడు తలయెత్తక కాలము గడపుచుండినను దేశపు రాజు ఏజీస్ (Agis) దేశాంతరము పోయియుండె అతని భార్య టిమియా (Timea) యితనియెడ అనురాగమ ప్రకటించెను. అతడామెను తిరస్కరింపజాలకపోయెను. అత వలన ఆమె గర్భము ధరించుటయే గాక తన పరిజనులలో విశ్వాసపాత్రులగువారితో సగర్వముగా ఆ రహస్యము వెల్లడించెను.

తమ మీాదికి దండెత్తివచ్చిన అథేనియనులు పొందిన యీా పరాభవమును జూచి ఖియోాస్, లెస్బాస్ ప్రజలు వారి పొత్తును వదిలిస్పార్టానుల పక్ష మవలంభింప తమ సంసిద్ధ తను ప్రకటించిరి. వారి కోర్కె ననుసరించి ఆల్సిబియాడెస్ కొందరు స్పార్టానులను వెంటబెట్టుకొనిపోయి ఆ దేశము నాక్రమించియున్న అథేనియన్ సైనికుల నెదుర్కొని పోరి వారినా దేశములనుండి తరిమివై చెను. అతడు స్పార్టానుల కిట్లు పెక్కు ఉపకారములు కావించినను, తన భార్యతో రహస్య సంబంధము కలిగియుండెననియు, ప్రజలు తనకన్నను అతనినెక్కుడుగా గౌరవించుచుండిరనియు ఏజీస్ అతనియెడ ఈర్ష్య వహించి, అయోనియాయందున్న ఆల్సిబియాడెసును వధించుటకు కొందరు హంతకులను పంపెను. అల్సిబియా డెస్ వారి యత్నమును గ్రహించి, వారిబారినుండి తప్పించు కొని పారిపోయి టిసాఫెర్నెను ఆశ్రయమును సంపాదించి అతనిచెంత సుఖముగా కాలము గడపదొడగెను. టిసా ఫెర్నెస్ పర్షియన్ చక్రవర్తికి సామంతుడు. అతని చెంత తన వాక్ నైపుణ్యమును, రాజనీతిచతురతను ప్రదర్శించి ఆల్సిబియాడెస్ అతని అంతరంగికమిత్రుడై ఆడంబరముతో జీవితము గడపజొచ్చెను. టిసాఫెర్నెస్ అతని మాటలువిని తానిదివరకు స్పార్టానులకు చేయుచుండిన సాయమును చేయుట మానివేసెను. అదే సమయమున అథేనియను

నౌకాబలమునకు స్పార్టాను నౌకాబలమునకు అబిడాస్ సమీపమున పెద్ద యుద్ధము సంభవించెను. ఆ యుద్ధమున యిరుపక్షముల సేనలును అతిఘోరముగా పోరెను. ప్రొద్దు గ్రుంకు వఱకు ఒక భాగమున స్పార్టానులు, మరియొక భాగమున ఎథీనియనులు విజయము సాధింపగలిగిరి. ఇట్లు పోరుచున్న వార్త విని ఆల్సిబియాడెస్ పదునెనిమిది నౌకలను వెంట గొనివచ్చి, తాను చెప్పినట్లు నడచుకొనుట కంగీకరించినందున అథేనియనుల పక్షమవలంభించి స్పార్టానులతో పోరి, వారి నౌకాబలమును చెదరగొట్టెను. ఆ యుద్ధమున అథేనియనులు ముప్పది స్పార్టాను నౌకలను వశపరచుకొని జయస్తంభమును నిలిపిరి. ఆ ఓటమికి వెఱగు చెందక స్పార్టానులు సిజికస్ (Cyzicus) చెంత అథేనియన్ నౌకాబలము నెదిరించిరి. ఆ యుద్ధమున అద్భుతమైన ప్రజ్ఞను ప్రదర్శించి ఆల్సిబియాడెస్ స్పార్టానుల నోడించి తరిమికొట్టెను. సిజికస్ అథేనియనులకు పట్టుబడెను. స్పార్టానులు దానికి సైతము వెఱవక అథేనియనులపై మరియొక దాడి సల్పిరి. ఈ యుద్ధమున ఆల్సిబియాడెస్ వారి సర్వసేనాధిపతియగు ఫర్నాబజ్‌ను ఓడించి తరిమివేసి చాల్సిడోనియనులను, బితియనులను జయించి హెల్లెస్పాంటును పూర్తిగా ఆక్రమించెను. పిమ్మట నతడు చాల్సిడన్‌ను ఆక్రమించి, సెలింబ్రియాను కొల్లగొట్టి, అథే యన్‌లకు తిరుగబడిన

బైజాంటియన్‌లను లోబరచుకొని, మాతృదేశమును జూడ వెడ్కగలిగి, ఆ యుద్ధములందు తనకు లభించిన నావల తోడను, సువర్ణాభరణముల తోడను, అపూర్వములగు ఆయుధముల తోడను ఏథేన్సునగరమును జేరెను. తమ్ము చుట్టుముట్టిన ఆపదలనుండి తమ్ము కాపాడి తమ దేశమునకు కీర్తిని సంపాదించి, తమ్ము జూడవచ్చిన ఆల్సిబియాడెసుకు స్వాగతమిచ్చుటకు లక్షలాదిగా ప్రజలు సముద్ర తీరమున జేరి, అతడు ఓడదిగి భూమిపై కాడుగిడి నంతనే పూలదండ లతో అతని కంఠమును నింపి పెద్ద ఉత్సవముతో అతనిని నగరములోనికి తీసికొనిపోయిరి. ఆ నాడతనిని జూచి తా మతని నగౌరవింపకుండిన సిసిలీలో తమ కపజయము సంభ వించియుండెడిది కాదనియు, తమ సామంత దేశములు తమ మీద తిరుగబడియుండెడివి కావనియు సాగరముల మీద తమకుండిన ఆధిత్యమును కోల్పోయి యుండెడివారము కా మనియు వారు చింతించిరి. అతడు దేశమున నడుగిడక ముందే అతనికి విధించిన శిక్షల నన్నిటిని వారు రద్దుచేసి యుండిరి.

ప్రజలిట్లు తమ ఆనందమును ప్రకటించుచుండ నగర మందలి వృద్ధులలో కొందరు అతడు నగరమున ప్రవేశించిన సమయము శుభప్రదమైనది గాకుండుటజూచి విచారింపదొడ గిరి. ప్రజాసామాన్యముగాని ఆల్సిబియాడెస్ గాని ఈ విషయ

మును గుర్తింపలేదు. అతడు దేశమునకు తిరిగివచ్చిన దిన మున నగరదేవతకు అర్చకులు అలంకారములు తీసివేసి ఆలయ ద్వారమును మూసియుంచిరి. ఆ దినమున ప్రజలకు దేవి దర్శనము లభింపదు. ఎలియుసిన్ ఉత్సవములకు ముందు వారీ యాచారమును పాటింతురు. కొంతకాలము నుండియు దేవికి వారు సాగరము మీద జరుపు ఉత్సవ మును వైరులకు వెరచిచేయుట మానివేసిరి. ఆల్సిబియాడెస్ స్వయముగా విగ్రహముల చెంత నిలువబడి ఆ ఉత్సవమును చేయించెను. ఆల్సిబియాడెసుకు వెరచి స్పార్టానులా వంకకు వచ్చుట మానివైచిరి. ఉత్సవము జయప్రదముగా నెర వేరెను. చిరకాలమున కీ యుత్సవమును కనుల జూడగలిగిన ప్రజలు నగరపాలకసభను రద్దుచేసి ఆల్సిబియాడెసుకు నియం తృత్వాధికార మీయదలచిరి.

అంతలో స్పార్టానులు ఆన్డ్రోసు మీద దాడి సలిపిరి. అథేనియనులు వారి నెదుర్కొనవలసివచ్చెను. స్పార్టానులకు ధనమును ఆహార పదార్థములును పుష్కలముగా నుండెను. అందుచే నౌకా యుద్ధమున మంచి అనుభవము గలిగిన ఆన్టియోకసుకు తమ నౌకల నప్పజెప్పి, ధనమును ఆహార పదార్థములను సమకూర్చుటకు ఆల్సిబియాడెస్ కారియాకు పయనమైపోయెను. అథేనియనుల బలమును నిర్మూలించుట కిదియే తగిన యదనని నిశ్చయించి స్పార్టానులు లైశాండర్

నాయకత్వమున ఆన్టియోకస్ మీాదబడి అతనిని వధించి కంటబడిన నౌకలను వెంటిగొని పారిపోయిరి. విపత్కాల మున దేశరక్షణ భారమును నిర్వహింప నెరగందెనని నేరము మోపి అథేనియనులు ఆల్సిబియాడెస్ వహింపవలసిన నౌకా దళాధి పత్యమును థ్రాసీబులస్ అను వానికప్పజెప్పిరి. ఆ వార్త విని తాను వారిచేత నుండరాదని తలచి ఆల్సి డెస్ తన అనుచరులను వెంట బెట్టుకొని దేశమును విడిచి పోయెను లైశాండర్ యీా వార్తవిని పరమానంద ముతో ఎగోస్‌పోటమి యందున్న అథేనియను నౌకలను తన నౌకాబలముతో చుట్టుముట్టి, చిక్కిన నౌకలను పట్టుకొని, చిక్కని వానిని తగులబెట్టి అథేనియన్ నౌకా బలమును సమూలముగా నిర్మూలి చుటయేగాక ఏథెన్సు మీాద దాడి సల్పి, ఎథేనియనులను పూర్తిగా ఓడించి వారి నగరము నాక్రమించి, ఆ నగరమును పాలించుటకు స్పార్టాన గవర్నరును నియమించెను. ఇట్లు తమ స్వాతంత్ర్యమును పూర్తిగా కోలు పోయిన పిదప అథేనియనులు తాము ఆల్సిబియాడెసుకు కావించిన అపకారమును గ్రహింపగలిగిరి కాని సమరాంగణమున అసాధారణమగు ప్రజ్ఞను శౌర్య మును ప్రదర్శించి ఎట్టి వైరినైనను క్షణములోపరాభూతుని గావించు శక్తి గలిగిన అతడు జీవించియుండిన ఏ క్షణముని నైనను వచ్చి తమ దాస్యశృంఖలములను ఛేదించి తమకు స్వాతంత్రింత్యమును సమకూర్పగలడను ఆశ మాత్రమ వారిని వీడకుండెను —

ఆల్సిబియాడెస్ ఆ సమయమున తిమండ్రా అను యువతిని చేపట్టి ఫ్రీజియా యందు నివసించుచుండెను. అతడు స్వేచ్ఛగా సంచరింపగలిగిన తమ కేనాటికైనను ముప్పుతప్పదని భావించి అతనిని వధింపుమని స్పార్టనులు ఆ నగరపాలకు నాజ్ఞాపించిరి. అనపరాధియగు వానిని తామనగా వధింపజాలక అతడా కార్యమును హంతకుల కప్పజెప్పెను. నిశా సమయమున సైతమతని నెదుర్కొన వెరచి వారు అతడు కాపురముండు యింటికి నిప్పుపెట్టి వెలుపల కాపువేసి నిలచియుండిరి. అదే సమయమున వైరులు తన కంఠమును నరికి అగ్నిలో వైచినట్లు కలగనిన ఆల్సిబియాడెస్ నిదురనుండి లేచి చూచునప్పటికి యిల్లు తగులబడుచుండెను. వెంటనే అతడు ద్రోహమును శంకించి తొడుగుకొనిన నోర్కాను విప్పి ఎడమచేతికి చుట్టుకొని కుడిచేత ఖడ్గము ధరించి, తలుపుదీసి వెలుపలికిపోయెను. పొదరమునుండి అతనిని చూచుచుండిన హంతకులు అతనిపై భల్లములను బాణములను ప్రయోగించిరి. అందులో ఒక ఆయుధము ఆయువుపట్టున దాక అతడు నేలకూలి ప్రాణములు విడిచెను. తిమాండ్రా అత్యంత వైభవముతో అతనికి అంత్యక్రియలు జరిపించెను.

ప్రజా ప్రభుత్వమున ప్రజలు బాధ్యతారహితముగా ప్రవర్తించుట వలన దేశమునకు కలుగు ముప్పును యీ చరిత్ర మనకు స్పష్టపరచును.



# లైశాండరు

డెల్ఫీ ఆలయముచెంత పొడవుగా వీపున వ్రేలాడుచున్న కేశములును, ముందు పొడవుగా వ్రేలుచున్న గడ్డమును కలిగియున్న శిలావిగ్రహమును బ్రాసిడాసుదని చెప్పుదురు. అది పొరపాటు, అది లైసాండరు విగ్రహము. ఇది స్పార్టానుల ఆచారమునకు భిన్నము. కాని పొడుగు జుట్టును లికర్గస్ నిషేధింపలేదు.

లైసాండరు ప్రభువుల సంతతివాడుకాడు, అతడు పేదయింటిబిడ్డ, కాని అతడు పేదరికమునకెన్నడును చింతింపలేదు. అతడు కీర్తిని కాంక్షించెనే కాని సంపదలనాసింపలేదు. బాల్యము నుండియు అతడు కష్టసహిష్ణుత యందు శిక్షణ వడసియుండెను. పెద్దలమాట నెప్పుడును అతడు జవదాటి యుండలేదు.

అథేనియనులు సిసిలీ యుద్ధమున ఓడిపోయిరి. అప్పుడు వారు సముద్రము మీదనున్న తమ ఆధిపత్యమును కోల్పో,

యితిమని దిగలుపడిరి. కాని ఆల్కిబియాడెస్ సాధించిన విజయముల వలన వారు ఉత్సాహవంతులయిరి. ఆల్కిబియాడేస్ చేతిలో ఓడిపోయిన స్పార్టానులు తమ నౌకాదళాధిపత్యమును లైసాండరు కప్పజెప్పిరి. ఈ పదవిని జేపట్టినంతనే అతడు ఇఫేసస్ చేరి అచ్చటనున్న వ్యాపారుల నౌకలనన్నింటిని ఆక్రమించుటయే గాక పనివారిని నియమించి యుద్ధనావలనైతము తయారు చేయించెను. పిమ్మట నతడు పర్షియా రాకుమారుని మైత్రిని సంపాదించి అతని సాయమున ఆల్కిబియాడేస్ మిత్రుడై యున్న టిసాఫర్నేస్‌ను తమ వంకకు తిప్పుకొనెను. అంతలో ఆల్కిబియాడేస్ తన నౌకాదళాధిపత్యమును ఆన్టియోకస్ కప్పజెప్పి సామోసును వదలి ఫోకెయ్యాకు Phoecaea వెళ్ళెను. అథేనియనుల శిక్షించుటకదియే తరుణమని నిశ్చయించి లైసాండరు వారి నౌకాబలమును ముట్టడించెను. ఇరుపక్షములవారును అతి భయంకరముగా పోరిరి. లైసాండరు అథేనియనుల నోడించి వారి నావలలో పదునైదింటిని పట్టివేసెను. ఈ అపజయమునుజూచి అథెయనులు ఆల్కిబియాడెసును నిందించి అతనిని నౌకాదళాధి పత్యము నుండి తొలగించిరి. ఈ విజయము వలన అథేనియనులకు సామంత పదవిలో నుండిన దీవులన్నియు లైసాండరు పక్షమునజేరేను. పర్షియా రాకుమారుడు నైతము అతని పక్షమే అవలంభించెను.

ఈ మిత్రుల బలములతో కలసినంతనే స్పార్టానుల నౌకా బలము మిక్కిలి పెద్దది అయ్యెను. దీనికంతటికిని లెసాండరు అధిపతి యయ్యెను, యుద్ధములందు విజయములు సాధించుటకు వలయు ఉపాయములను, జిత్తులును లైసాండరుకు కొట్టిన పిండియై యుండెను. అతడు కదన విజయమునకు శౌర్యసాహసములకన్నను మోసములకు, ఉపాయములకు ఎక్కువ ప్రాధాన్యత నిచ్చును. తాను చేయునది ధర్మమా, అధర్మమా అను చింత అతను నెన్నడును బాధింపదు, తాను వైచిన పథకము పారునా పాదా అను చింత యొక్కటియే అతనిని భాదించుచుండును. విజయసిద్ధి కతడు అధర్మ పద్ధతులనవలంభించుట కేనాడును వెనుదీయడు. తన కనుకూలమైనపుడతడు ధర్మసూత్రముల వల్లెవేయును. ప్రతికూలమైనప్పుడు ప్రత్యర్థులతో మొండి వాదమునకు దిగును. అవసరమగునేని అసత్య ప్రమాణములు చేయుటకు సైతమతడు వెనుదీయడు.

సమరారంభమునకు ముందు సైరస్ అతనిని సార్డిసుకు పిలిపించి కొంతధనమిచ్చి ఇంకను అవసరమగునేని వెంటనే తనకు తెలియజేయుమనిచెప్పెను. ఆ ధనమునుగైకొని అతడు చెంతనున్న కొద్దిపాటి బలముతో ఎజీనా, సాలామిస్ అట్టికాలను ఆక్రమించెను. అంతలో అథేనియనులమూల నౌకాదళము తన మీదకి వచ్చుచున్నదన్నవార్త అతని

చెప్పబడెను. అది లైసాండరు చెంతనున్న నౌకాదళము కన్నను మిక్కిలిపెద్దది. దాని నెదిరించి పోరగలశక్తి అతనికి లేదు. అందుచే దాని కంటబడరాదని నిశ్చయించి దొంగ దారిని పయనించి తన నౌకాబలముతో హెల్లెస్పాంటుచేరి ఆ ప్రాంతమును కొల్లగొట్టెను. ఆ వార్తవిని అథేనియను నౌకలచ్చటికి పరువిడెను. వానితో బహిరంగ యుద్ధమునకు తలపడుట కది తరుణముగాదు. అందుచేత తన నౌకలకు రేవు వదలి అవతలకు రావలదని అతడాజ్ఞాపించెను. పిమ్మట నతడు మంచి వీరులుగల ఒక చిన్న సేనను భూభాగమున నిలిపి చారుల నియమించి అథేనియన్ నౌకాదళముల సంచలనముల పరిశీలించుచు ఒక చోట దాగియుండెను. వీరి నావలు తమతో తలపడునని అథేనియను నావికులు, ఒకరోజు, రెండురోజులు, మూడురోజులు ఎదురు చూచిరి. లాకే డేయిమను లొక్క యడుగైనను ముందుకు వేయకుండిరి. అంతలో ఆల్కిబియాడేస్ అచ్చటికివచ్చి అథేనియను నౌకల సంగ్రామసన్నాహ క్రమమును పరిశీలించి అందలి లోపములను వారికి తెలిపి స్పార్టానులతో పోరదగు పథకము లను వారికి వివరించిచెప్పెను. కాని తన మాటలవారు పాటింపకుండుటజూచి అతడు వెడలిపోయెను. అతని నావలికి పోవనిచ్చి లైసాండరు తన నౌకాబలమునుండి ఒక చిన్న బలమును వేరుచేసి, వానిని అతివేగముగా పయనించి అథేనియను నావల నడకలను పరిశీలించిచూచుచు, అవి తీర మును సమీపించినంతనే కాంస్యఫలకముల నెత్తిపట్టి అవి తీరము చేరిన వార్త తమ నౌకలకు తెలుపు సంజ్ఞను

కావింపుడని ఆనతిచ్చి, వానిని పంపి - పిమ్మట సతడు మిగిలిన నావలయందు సంచరించి అందలి నావికులకు అథేని యనులతో పోరదగు ఉపాయములను వివరించి చెప్పి తమ నావలు కావించు కాంస్యఫలకముల సంజ్ఞను కనిపెట్టిచూచి అది కంటబడిన తనే వేగముగా పయనించి వైరి బలముతో పోర నాజ్ఞాపించెను. అతడు చెప్పిన పనులయందు వారప్రమత్తులై చూచుచుండ కొంతకాలమునకు వారెదురుచూచు చుండిన కంచుడాలుల గుర్తు వారికి కనపించెను. వెంటనే అతి వేగముగా పయనించి వారు అథేనియన్ నావలతో తలపడిరి. అంతలోలైసాండరు భూమిపైనుంచిన పదాతిదళము సాగర తీరమున జేరి అథేనియనులనెదుర్కొని పోర సంసిద్ధమై నిలచెను.

ఒక్కసారిగా దిక్కులు మారు మ్రోగునట్లు త్రుప్పెటలు మ్రోగెను ఆ సమయమున అథేనియను నావికులలో అనేకులు నౌకల యందులేరు. ప్రొద్దు బుచ్చుటకు వారు తీరమున సంచరింపబోయి వైరులగని కలవరముజెంది కేకలు పెట్టుచు అటు నిటు పరుగిడసాగిరి. వారి కేకలు విని భటులు, నావికులు నౌకల చెంతకు పరుగిడివచ్చిరి. వారి చేతులయందు ఆయుధములు లేవు. లాకేడెమనులు వారిపై బడి యిచ్చవచ్చినట్లు వారిని నరికివేయ మొదలు పెట్టిరి. వారు నిర్మానుష్యములయిన నావలలో కొన్నిటి నాక్రమించిరి. కొన్నిటిని ముంచివేసిరి. నిరాయుధులుగా నుండిన భటులను, నావికులను వధించిరి. తప్పించుకొని ఒడ్డెక్కి పారిపోవ యత్నించినవారిని లైసాండరు అంతకు

ముందు తీరమున నిలపిన లాకేడెమోనియన్ పదాతి దళమందలి సైనికులు మట్టుపెట్టిరి. చచ్చినవారు చావగా మూడు వేల మంది అథేనియనులు లైసాండరు భటులకు పట్టుబడిరి. వారిలో ఒక్క కానన్ Conon అను ఉపసేనాపతి మాత్రము ఎనిమిది నావలుగలిగిన తన నౌకాదళముతో వారి బారినుండి తప్పించుకొని సైప్రెసుకు పారిపోగలిగెను. ఈ విజయమును సాధించుటకు గొప్ప గొప్ప నౌకాదళాధిపతులు పెద్ద పెద్ద నౌకాబలములతో కొన్ని సంవత్సరములు యత్నించిరి. వారికి లభ్యముకాని యీ అద్భుతవిజయము లైసాండరు తన బుద్ధిబలముతో అతిస్వల్పకాలములో ఒక చిన్న సేన సాయముతో సాధించగలిగెను. ఇంతసులభముగా లభించిన యీ ఘనవిజయమును జూచి కొందరు యిది అదృష్టవశమున లభ్యమైనదేకాని అతని ప్రజ్ఞవలన లభించినది గాదనిరి. ఎవ్వరేమియన్నను అతడు అథేనియనులపై ఘన విజయమును సాధించిన సత్యమును మాత్రము ఎవ్వరును కాదనజాలరు. ఈ విజయమును చేపట్టిన పిదప అతడు ఏథెన్సునగరమున ప్రవేశించి అచ్చట పాలకుని (governer) నియమించి గ్రీసుదేశము నంతటిని ఆక్రమించి అందు తనకు లభించిన ధనమును సంచులకెత్తించి గిలిప్పస్ gvlippus అను సేనాని ద్వారా స్పార్టాకు పంపెను. అతడు దురాశాపరుడై సంచుల అడుగున చిలుము పెట్టి యిచ్చవచ్చినన్ని నాణెముల నపహరించి చిల్లులు కుట్టివేసి సంచులను నగరమందలి పాలకుల కప్పగించెను. ఆ సంచులను కుట్టించి నప్పుడు లైసాండరు వానియందుంచిన నాణెముల సంఖ్యను

తెలుపు చీటను పెట్టించి యుండెను. పాలకులు సంచులను విప్పించి లెక్క పెట్టింప సంచుల యందుండిన నాణెముల సంఖ్య చీట్ల యందలి సంఖ్యలకు తగ్గుచుండెను. అది యెట్లు జరిగినదని వారు యోచించుచుండ గిలిప్పస్ యింటనుండు పరిచారకులలో నొకడు న్యాయాధిపతులలో నొకని చెంత జేరి రహస్యముగా "మా యింటి పెంకుల క్రింద గుడ్లగూబలు చేరినవ"ని చెప్పెను. నాణెముల మీది గుడ్లగూబ ముద్రలను జూచి సేవకుని మాటల రహస్యమును గ్రహించి గిలిప్పస్ యింటిపెంకులను తీయించి చూడ వానిక్రిందనున్న నాణెములు వారి కంటబడెను. గిలిప్పస్ మహావీరుడై యుద్ధమున అతి సాహసముతో పోరి యుండినందున చేసిన నేరము గొప్పదైనను మరణశిక్ష విధింపక దేశబహిష్కార శిక్ష విధించిరి.

లెసాండరు యుద్ధరంగము నుండి డెల్ఫీకి బోయి అచ్చట తమ దేశపు వీరుల కాంస్య విగ్రహముల నిల్పి స్వదేశమునకు తిరిగి వచ్చెను. అతని కదన కళాకౌశలమును, దేశభక్తిని వర్ణించుచు కవులు కావ్యములు గీతములు రచించిరి. గాయకు లా గీతములను గానము చేసిరి.

లెసాండరు వీరుడయ్యును వీరులకు సహజముగు ఔదార్యము నెన్నడును ప్రదర్శింపలేదు. అతడు తన ప్రత్యర్థులను దయారహితుడై శిక్షించి నిర్మూలించెను. కాని అతనికి స్వార్థములేదు. అతడు యుద్ధములందు తనకు లభించిన ధనమును ప్రభుత్వమున కిచ్చివేసెనే గాని ఒక్కరూకనైనను తాను గైకొనలేదు.



# లికరగస్

లికరగస్ చరిత్రను గురించి చరిత్రకారులు భిన్నమైన అభిప్రాయములను కలిగియున్నారు. అతని పుట్టుకను గూర్చి మరణమును గూర్చి ఒకరు చెప్పినట్లు ఒకరు చెప్పలేరు. ఇతడు ఒలింపిక్ క్రీడలు ఆరంభమైన రోజులో జన్మించియుండెనని అరిస్టాటిల్ చెప్పెను. మరికొందరితడు హోమరు కాలమువాడని యందురు. మరికొందరు యీ పేరుకలవారిద్దరు కలరని చెప్పుదురు. బహుజనాభిప్రాయము ననుసరించి మనమతని చరిత్రను గ్రహించుట ఉచితముగా నుండును.

లికరగస్ హెర్క్యులీసుకు పదకొండవ తరమువాడు. ఇతని తాతలలో నొకడగు సౌస్ ఆర్కేడియాను ఆక్రమింప యత్నించి ఒక నిర్జలప్రదేశమున శత్రువుల వ్యూహమున చిక్కుబడి మంచినీటిని త్రాగనిచ్చిన దానిని వదలి తనదేశమునకు తిరిగిపోవుదునని శత్రువులకు తెలియపరచెను. వైరులందుల కంగీకరించిరి. సౌస్ తనభటులనందరిని తృప్తిగా నీరుత్రాగుడని చెప్పి తాను ముఖమునుమాత్రము కడుగుకొని ఆక్రమించిన భూమి శత్రువులకీయ నిరాకరించెను. అతడిట్లు కష్టించి సంపాదించియున్న రాజ్యమును అతని సంతతివారు సరిగా పాలింపజాలనందున ప్రజలు తిరగబడి లికరగస్ తండ్రిని చంపివైచిరి. వెంటనే లికరగస్ అగ్రజుడు పాలిడెక్టస్ సింహాసన మెక్కెను. కాని అతడు ఎక్కువకాలము జీవింపలేదు. అతడు మరణించునప్పటికి అతనిభార్య గర్భము ధరించియుండెను. ఆమెకు మగపిల్లవాడు పుట్టినచో రాజ్యము నతనికిచ్చివేయుదునని చెప్పి లికరగస్ రాజదండమును చేపట్టెను. తన్ను వివాహమాడ నిష్టగించుచో తాను గర్భ

విచ్ఛేదము గావించుకొందునని పాలిడెక్టస్ భార్య రహస్యముగా అతనికి తెలియపరచెను. దానివలన చిక్కులేర్పడునని ఊహించి గర్భస్రావమువలన ఆరోగ్యము చెడుననియు, ప్రాణములకే ముప్పసంభవించుననియు, పుట్టిన బిడ్డను, యితర ఉపాయములతో వధించుకొని తాము సుఖముగా రాజ్యపాలనము గావించుకొనవచ్చునని ఆమెకు తెలియపరచి, ఆమె మగపిల్లవానిని కనినచో వెంటనే తెచ్చి తనకప్పగింపుడని సేవకులకు జెప్పి లికరగస్ రాజ్యపాలనము సాగించుచుండెను. రోజులు గడిచి నవమాసములు నిండి రాణి మగపిల్లవానిని గనెను. సేవకులా బాలుని గొనిపోయి న్యాయాధిపతులతోగూడి విందుభోజనము చేయుచుండిన లికరగస్‌కు అప్పజెప్పిరి. అతడా బిడ్డకు 'ఖారిలాస్' (ప్రజలకు మోదము గూర్చువాడు) అని పేరుపెట్టి పెద్దల కందరికిని జూపి "ఇతడే మనకిక ప్రభువు. నేను యితనికి ప్రతినిధిగా మాత్రమే రాజ్యపాలనము సాగింతును." అని ప్రకటించెను. అతని సత్యవర్తనమునకు న్యాయాధిపతులు సంతసించిరి. కాని అతని చర్య పాలిడెక్టస్ భార్యకు నచ్చలేదు. అతడుచేసిన పనివలన ఆమెకలలు చెదరిపోయెను. తన ఆశ లడియాసలగుటచే ఆమె యీర్ష్యవహించి లికరగస్ మీద లేనిపోని నిందలువేయ మొదలుపెట్టెను. ఆ నిందలు భరించుచు అచ్చటనుండుట మంచిదికాదని భావించి లికరగస్ దేశమువదలి క్రీటుకు వెడలిపోయెను. అచ్చటనున్న కాలమున అతడా దేశపరిపాలనావిధానమును పరిశీలించి అందలి మంచిచెడ్డలను గ్రహించెను, అంతలో అతనికి థేల్స్ అను పండితునితో పరిచయమయ్యెను, అతడు గొప్ప ధర్మశాస్త్రవేత్త. రాజనీతిని క్షుణ్ణముగా పరిశీలించినవాడు. నిశితములైన భావములతో మనోహరమైన గీతములు రచించిన గొప్పకవి. ప్రపంచమున అతనికి మించిన నీతిశాస్త్రవేత్త లభించుట దుస్తరమని లికరగస్ గ్రహించెను. అతని గీతములు కలహముల వర్జింపవలెననియు, ఐకమత్యముతో జీవింపవలననియు,

పొందగోరి డెల్ఫీకి పోయి అపోలోకు అర్చనలు జరిపించెను. అచ్చటి ఎరుకవారు అతని కిట్లు చెప్పిరి. "నీవు దివిజులకు ప్రియుడవు! అంతే కాదు! నీవు దివిజుడవే! నీ సంకల్పమును దివిజులు హృదయపూర్వక ముగా ఆశీర్వదించుచున్నారు. నీవు తలపెట్టిన సంస్కరణము లపూర్వ ములు. మానవుల కంతకుమించిన ఉత్తమ సంస్కరణములు లభింపవు, నీ పరిపాలనావిధానము విశ్వవిఖ్యాత మగును!"

ఈ మాటలు విని అత డత్యుత్సాహముతో దేశమునకు తిరిగివచ్చి తన సంకల్పమును మొదట ప్రజానాయకులలో ముఖ్యులకు తెల్పి వారి ఆమోదమునువడసి. ఇదపపెద్దలకు, ప్రభువులకుచేప్పి వారిసమ్మతివడసి, ఒక శుభదినమున తన నూతన వ్యవస్థను నెలకొల్ప నిశ్చయించి, దానిని ప్రతిఘటింప యత్నించు విప్లవకారుల నణచివేయుటకు సమర్థులగు ముప్పది మంది యువకులను నగరమందలి కీలకస్థానముల యందునిలిపి తన కార్య మున కుపక్రమించెను.

అతడు కావించిన సంస్కరణములో మొట్టమొదటిది ప్రజాపరిపాలన మున కొక సెనెటును స్థాపించుట. అందు ముప్పదిమంది సభ్యులుందురు. ఈ సంస్థ దేశక్షేమమునకు సంబంధించిన వ్యవహారము లన్నింటియందును ప్రభువులతో సమానమగు అధికారము కలిగియుండును. అతడు దీనిని స్థాపింపకముందు ఒక సమయమున ప్రభువులును, వేరొక సమయమున ప్రజలును బలాధికులై ఒకరినొకరు నిర్మూలించుకొన యత్నించుచు దేశ మున అరాజకమును వ్యాపింపజేయుచుండిరి. లికర్గస్ స్థాపించిన సెనెట్ ఓడకు అడుగుననుండు బరువు (ballast) వలె దేశమునకు సుస్థిరత్వమును చేకూర్చెను. ఈ సభవారు ప్రభువులు స్వలాభపరాయణులై వర్తించు నపుడు ప్రజల పక్షమును, ప్రజలు స్వలాభపరాయణులై వర్తించునపుడు

ప్రభువుల పక్ష మవలంబించి యిరువురకును సామరస్యము నెలకొల్పి కృషిసల్పుచు దేశక్షేమమునకు పాటుబడుచుందురు. ఈ సభ సమావేశములకు భవనము లెవ్వియును నిర్మింపరాదని లికర్గస్ కట్టడిచేసెను. ఈ సభలు ఎప్పుడును ఆరుబయలు ప్రదేశములయందే సమావేశము కావలెను. ఈ సభను స్థాపించుటవలన రాజులకు గల అధికారము తగ్గిపోయెను. కాని వారి పదవులు సుస్థిరము లయ్యెను. పొరుగుదేశము లగు ఆర్గోస్, మెస్సెనే లయందలి ప్రభువులవలె వారు తమపదవులను కోల్పోవలేదు. స్పార్టాలో యీ సభ యేర్పడకముందు ఆర్గోస్ మెస్సేనేలు స్పార్టాకన్నను ఎక్కువ ప్రాబల్యమును కలిగియుండెను. ఈ సభ నెలకొనినపిదప స్పార్టా వానికన్నను ఎక్కువ ప్రాబల్యమును సంపాదింపగలిగెను.

లికర్గస్ తన మొదటి సంస్కరణము జయప్రదమయినయంతనే రెండవ సంస్కరణమును ప్రవేశపెట్టెను. ఇది ప్రజల సంపదకు సంబంధించినది. అల్పసంఖ్యాకులగు సంపన్నులు దేశసంపదనంతటిని గుప్పిట బట్టుకొని యుండిరి. వారు గర్వితులు, సోమరులు, భోగులు, దాంభికులు, ప్రజాకంటకులునై యుండిరి. అధిక సంఖ్యాకులగు ప్రజలు పేదలు, దుర్బలులు, రోగగ్రస్థులునై యుండిరి. ఇందువలన ప్రజలలో ద్వేషములు కక్షలు ప్రబలుచుండెను. ఈ దుర్దశను తొలగింప నిశ్చయించి అతడు ప్రజలలో శక్తిసామర్థ్యములందు హెచ్చుతగ్గు లుండవచ్చును, గాని సంపదలయందు భేదము లుండరాదు అని ప్రకటించి దేశమందలి భూముల నన్నిటిని ముప్పదివేల సమభాగములుగా విభజించి వానిని ముప్పదివేల కుటుంబములకు పంచియిచ్చెను. ఈ విభజనవలన నగరమందలి కుటుంబములకన్నిటికిని ఒక్కొక్కదానికి ముప్పది బుషెలుల ధాన్యము దానికి తగిన ఆలివ్‌నూనె మధువు మొదలగు అత్యవసర పదార్థములన్నియు లభించెను. మహాసూలు రోజులలో వారి భూములను చూచినవారికి

సమానమగు గడ్డికుప్పలు ధాన్యపురాసులు కనబడుచుండెను. ఆ రాసులు అన్నదమ్ముల భాగములవలె సర్వసమానములై చూపరుల కానందదాయక ములై యుండెను.

స్థిరాస్థిపంపకము జయప్రదమైన వెంటనే యతడు చరాస్తి పంపక మునకు బూనుకొని ప్రజలచెంతనున్న వెండి, బంగారములను తెప్పించి ప్రభుత్వ కోశాగారమున భద్రపరచి ఇనుమును ద్రవ్యముగా చలామణి చేయించెను. దానిని సమకూర్చ నెవ్వడు పాటుబడును? దాని పరిమాణము హెచ్చు; బరువు ఎక్కువ; దాచుటకు వీలుగాదు ; మోసికొనిపోవుటకు సాధ్యముగాదు. ఈ ద్రవ్యము అమలులోనికి వచ్చినంతనే అనేక దుర్గుణ ములు ప్రజలను వదలిపెట్టిపోయెను. దొంగతనములు, వివాదములు, లంచములు. కలహములు అంతరించెను. విలాస వస్తువులు మాయ మయ్యెను. పదుపు వృత్తి అంతరించెను. నిత్యావసర వస్తువులు మంచము, కంచము, చెంబు, తప్పెల మొదలగునవి ఎంత మంచివి కావలె నన్న అంత మంచివి కోరినవారందరికి లభించుచుండెను. లికరగస్ స్వార్థానులను భోగభాగ్య రహితులనుగావించి తృప్తినందలేదు. వారిస్వేచ్ఛ నుసైతము అరికట్టుట కతడొక పథకమును వైచెను. అపథకము ననుసరించి ఆ నగరమందలి పురుషులెవ్వరును వారియిండ్లలో వారు భోజనములు చేయ రాదు. ప్రభుత్వభోజనశాలకు ధాన్యము చందాయివ్వవలెను, అచ్చటికివచ్చి భోజనము చేయవలెను. అచ్చట పుష్టికరమైన ఆహారము లభించును. కాని రుచికరమైన భోజనము లభింపదు. దానినైనను వారుమితముగానిత్తురు. అడిగినంత పెట్టరు. నిన్నటివరకును యిష్టమువచ్చినట్లుతిని, పొట్టలుపెంచు కొని, బుద్ధిని, దేహమును పాడుచేసుకొని, మాయంతవారులేరని విర్రవిగు చుండినవారు లికరగస్ శాసనమున సామాన్యుల సరసను గూర్చుండి భోజ నము చేయవలసివచ్చెను మొదటి రెండు చట్టములను అందరును అంగీక

రించిరి గాని యీ పట్టణపు ధనికులలో కొంద రంగీకరింపజాలకపోయిరి. వారిలో ముఖ్యుడు అల్కాండరస్ అతడు లికరగస్ ఒకనాడొంటిగా పోవుచుండుట చూచి వెనుకపాటుగాబోయి తనదండముతో అతని చిలమువగట్టిగా మోది అతడు వెనుదిరిగి చూచునంతలో కాలికి బుద్ధిచెప్పి పరుగిడపోదగెను. కాని ప్రజలతనిని వదిలిపెట్టలేదు. మార్గమునుండి ఆ దృశ్యమును చూచిన ప్రజలతనిని తరిమి పట్టుకొనితెచ్చి లికరగస్ ఎదుటనిలిపి శిక్షింపదలచిరి. లికరగస్ వారిని శాంతపరచి పంపివేసి అల్కాండరస్ను తనవెంట తీసుకొని పోయెను. అతడు కొట్టినదెబ్బ చిన్నదికాదు ఆదెబ్బకు లికరగస్ నోటిలోని దంతములు కొన్నిరాలిపోయెను, లికరగస్ వానిని ప్రజలకు చూపలేదు. అల్కాండరస్ దానిని జూచినంతనే లికరగస్ ప్రదర్శించిన ఓర్పును ఔదార్యమును గ్రహింపగలిగెను. లికర్గస్ అతనిని కొంతకాలము తనవెంట నుంచుకొని తన ఆశయముల నతని హృదయమున కెక్కునట్లు చక్కగా వివరించి చెప్పెను. లికర్గస్ మాటలను, అతని జీవితమును స్వయముగా పరిశీలించిచూచిన అల్కాండరస్ అతని ఆశయములను అతనికన్నను ఎక్కువ ఉత్సాహముతో ప్రచారముచేయ మొదలుబెట్టెను.

లికర్గస్ అమలుపరచిన యీ పంక్తిభోజనముల నాదేశీయులు ఫిడిటియా (Phiditia) ప్రేమ భోజనములు అని వ్యవహరింప దొడగిరి. ఇల్లు కలిసి భుజించుటవలన మంచిచెడ్డలు చెప్పుకొనుటకు స్నేహము పెంపొందించుకొనుటకు వారి కవకాశము కల్గెను. పౌరులీ భోజనములకు గాను నెలనెలా యింటికొక బుషల్ ధాన్యమును, యెనిమిది గ్యాలనుల ద్రాక్షాసవమును, ఐదు పౌనులజున్ను, రెండున్నరపౌనుల అత్తిపండ్లు, దానికి దగిన పలలము. చేపలుతెచ్చి యిచ్చుటకు యేర్పాటు చేసికొనిరి. ఇవిగాక దేవతలకు పూజలు చేయించి మ్రొక్కులు చెల్లించిన గృహస్థులు తాము

దేవునకు నివేదించిన పదార్థములలో తగినభాగము సైతే మిటకు పంపు చుండిరి.

పాఠశాలలకు పోవు విద్యార్థులుసైతం మిచటనే భోజనము చేయు చుండిరి. వారు పెద్దలు కావించు రాజకీయ చర్చలను, సాహిత్య ప్రసంగ ములను, అసభ్యములులేని వినోద ప్రసంగములను వినుచు మనోవికాస మును పొందుచుండిరి. అచ్చట భోజనముచేయువా రందరును పరస్పర సౌహార్ద్రమును కలిగియుండవలెను. ఆ సంఘమున భేదాభిప్రాయము కలిగినవారికి స్థానముండదు. వారి వంటకములలో ప్రసిద్ధి గాంచినది నల్లపులుసు (Black broth)వృద్ధులు తమవంతుకు వచ్చిన పక్వపలలమును యువకులకిచ్చి దానికిబదులు నల్లపులుసు వారినుండి గైకొనుచుందురు. రేల యందు వారు భోజనములు చేసిపోవునప్పటికి వారి యిండ్లయందు దీపము లార్పబడియుండును. దీపపువెలుగున వా రిండ్లయందు ప్రవేశింపరాదు. అది వారి కట్టడి. వారనుసరించు యీ కట్టుబాట్లను లిఖితరూపమున చట్ట ములు చేయరాదని లికర్గస్ శాసించెను. హృదయపూర్వకముగా అంగీక రించి అనుసరించు ఆచారములు శాశ్వతముగా నిలచును కాని గ్రంథము లందు వ్రాసిపెట్టిన చట్టములు శాశ్వతముగా నిలువజాలవని అతడు చెప్పెను. ప్రజలు ఆచరించి దానివలన సత్ఫలితములను పొంది వాని నభిమానించినప్పు డవి వారి హృదయఫలకములపై గాఢముగా ముద్రితము లగునని అతడు విశ్వసించెను. సమర్థుడగు పాలకుడు ఏ పనినైనను ప్రజలకు నచ్చజెప్పి వారిచే ఆపనిని చేయించునుగాని చట్టముచేసి బలవంత ముగా వారిచే చేయింప యత్నింపడు. ప్రబోధ మెప్పుడును అధికారము కన్నను శ్రేష్ఠమగు ఫలితముల నీయగలుగును. ప్రజల నీ మార్గమున నడిపించుటకు క్రీట్‌నుండి అతనివెంట వచ్చిన థేల్స్ పండితుడు అతనికి కావలసిన సాయమంతయును చేసెను.

అతడు స్థాపించిన మార్పులలో మరియొక ముఖ్యమైనది భోగవిసర్జ నము. ఆ రాజ్యమందలి ప్రజలు మద్యపానము సేవియునుచేయరాదు. భోగ ములను, విలాసములను ఆశించరాదు. వారు యిండ్లకు వాకిటలకును రంప మును తప్ప చిత్రిక (తోపుడి) నుపయోగించరాదు. అట్లు నిర్మింపబడి యిండ్ల యందు విలాసవస్తువులకు తావులభించదు. అట్టియింట బుద్ధిమంతుడెవ్వ డును వెండి కోళ్ళమంచములను, పట్టుపరుపులను, వెండి బంగారుపాత్రలను కలిగియుండజాలడు. కాని వారు నివసించు గృహములుగాని, వారు వాడు కొను వస్తువులుగాని, విస్తృతముగానుండక మోటుమోటుగా నుండును. వెలస్వల్పము విలువధికము అనుమాట వారియెడ సార్థకతనందెను.

వారు పాటింపవలసిన మరియొక ముఖ్యసూత్రము "యుద్ధములు తరచుగా చేయరాదు. విధిలేక చేసినప్పుడు దానిని పొడిగించరాదు. ఏదేశ ముతోగాని దీర్ఘయుద్ధముచేయుట తనయుద్ధపద్ధతుల యందు వారికి తర్ఫీదు నిచ్చుటగాని అన్యాయమగును అని లికరగస్ వారికి బోధించెను.

అతడు నెలకొల్పిన సూత్రములను స్పార్టనులు రెట్రాస్ (Rhetras) అందురు. అనగా అవి మానవ నిర్మితములుకావనియు, దైవదత్తములనియు అర్థము. వీని పెద్దలు లికరగస్ పూనినవని యువకులకు విద్యగరపుట. ప్రముఖ్యముగ ప్రజలకు గరపువిద్య మీదనే ప్రభుత్వముయొక్క బలమాధార పడి యుండును. ఉత్తమవిద్యను గరపు ప్రభుత్వము దృఢముగా నిలచియుం డును. పనికిరాని చదువుచెప్పు ప్రభుత్వము బలహీనమై కూలిపోవును. అతడు బాలకులకే గాక బాలికలకు సైతము విద్యఅవసరమని గుర్తించి బాలకులకెట్టి విద్యను సమకూర్చెనో బాలికలకు సైత మట్టి విద్యనే సమకూ ర్చెను, బుద్ధివికాసమునకొక్క దానికే కృషిసల్పునది విద్య యెంతమాత్ర మునుగాదు అనిభావించి వారు బుద్ధిబలమును సంపాదించుట కెంత కృషిసల్పు దురో దేహబలమును సంపాదించుటకు సైత మంత కృషి చేయవలెననిరి.

కాయము దృఢముగానున్న బుద్ధి నిశితముగా నుండును అనునది వారి ముఖ్య సూత్రము. స్పార్టానులలో బాలురవలెనే బాలికలు సైతము పందెములు వేసి పరుగిడుదురు. మల్లయుద్ధము, బాణప్రయోగము, భల్లప్రయోగము మొదలగు విద్యలన్నిటియందును వారు శిక్షణ పొందుదురు. ఆ దేశపు స్త్రీలు తాము దృఢకాయలై యుండుటయేగాక మంచి పుష్టిగలిగిన సంతానమును దేశమాతకు ప్రసాదింపగలిగియుండిరి. లోకమున స్త్రీలు శిశువును ప్రసవించుటయన పునర్జన్మ యెత్తుట అని భయపడుచుందురు. ఆ దేశపు స్త్రీల కాభయము లేదు. అది వారికి నిత్యకృత్యములలో నొకటి. వారు పాటలుకట్టి గాననాట్యములు చేయుదురు. వారి పురుషులు మంచిపనులు చేసినప్పుడు ప్రశంసాగీతములతో వారికి స్వాగత మిత్తురు. అకార్యములు చేసినవారిపై నిందాపూరితమైన గీతములు రచించి పాడి వారి నవమానింతురు. వారు యెల్లవేళలయందును యువకులను ఉత్తమ కార్యములకు ప్రోత్సహించుచుందురు. వారు ఘనతను వాంఛింతురు, ఘనతకొరకు జీవింతురు. ఒకానొక సమయమున గార్గో అను నామెతో ఒక విదేశవనిత "ప్రపంచమున పురుషుల పాలింపగలశక్తి ఒక్క స్పార్టాన్ యువతులకే కలదు" అని పలుకగా ఆమె "నీమాట కాదనను. మా కడుపున వ్యర్థులు పుట్టరు. కాన మేము వారిని పాలింపగలుగుచున్నాము" అని ప్రత్యుత్తర మిచ్చెను. ఆ దేశమున పురుషులు వివాహమాడుట, సంతానమును గనుట ముఖ్యవిధులుగా భావింతురు. బిడ్డలులేని పురుషున కాదేశమున గౌరవము లేదు. అట్టివాడు వచ్చినప్పుడు చిన్నపిల్లలు సైతము వానినిచూచి లేవరు. వారి సంఘమున బాల్యవివాహములు లేవు. వయసునన్న యువతిని కోరిన యువకుడు బలమునుపయోగించి ఎత్తుకొనిపోవును. ఇట్లపహరింపబడిన యువతి నతడు వివాహమాడినపిమ్మట వయసుమీరిన యువతి ఒకతె వచ్చి ఆమెను చీకటింటిలో నున్న శయ్యమీద వదలి వెడలిపోవును. వరుడు తోడివారితో గలిసి భోజనముచేసి, వారందరును పరుండి నిదురించినపిమ్మట

నిశ్శబ్దముగా లేచి, తన భార్యవెంటను బోయి, కన్యాత్వభంగమును నాకు కోరకుమీని చెప్పి, ఆమెతో సుఖముగా కాలముగడిపి సూర్యోదయమునకు లేచి వనకుబోయి, తన స్వస్థానమున కుటుంబి నిమురించి. అంతరోసాము ఉదయమున నిద్రలేచును. ఇతని వివాహజీవిత మదేవిధముగ వానికి బిడ్డపుట్టునంతకు రహస్య సమావేశములయందే గడచిపోవును. పెండ్లిలో ఆ దంపతులు కలియుటకు అవకాశముండదు. వివాహమయినప్పుడు వారు దేహపరిశ్రమను మానరు. ఆ త్రిగుణముతో జీవితము గడుపుదురు. వారి సమావేశములు పరిమితముగా నుండుటవలన ఒకరిమీద నొకరికి మోహము మెత్తను. వారి అనురాగము ప్రథమ సమావేశమున నెంత ప్రియముగా నుండునో బిడ్డలు పుట్టునంతకును అంతప్రియముగనే యుండును. వ్యభిచారము వారికి అన్యదేశపదము. సత్సంతానము నభిలషించి యే స్త్రీ యే పురుషుని పొందగోరినను వారు అడ్డుచెప్పరు. మంచిసంతానము నభిలషించి మన ఆవును మంచి వృషభముచెంతకు గొనిపోయినట్లు వంశవృద్ధిని కోరుచు ఉత్తమపురుషుని వాంఛించుట స్త్రీకి తప్పుకాదని వారు భావింతురు. స్త్రీల కిట్టి స్వేచ్ఛ లభించినందున వారిసంఘమున వ్యభిచారము సమూలముగా నశించెను. ఒక అన్యదేశీయుడు యొక స్పార్టాను యువకుని 'మీ దేశమున వ్యభిచారస్త్రీల కెట్టి శిక్షలు విధింతురు?' అని ప్రశ్నింప నతడు "మా స్త్రీలలో వ్యభిచారిణు లుండరు" అని ప్రత్యుత్తర మిచ్చెను.

ఆదేశమున బిడ్డలమీద ప్రభుత్వమునకున్న హక్కు తల్లిదండ్రులకు లేదు. ప్రభుత్వ మనుమతింపని బిడ్డను తల్లిదండ్రులు పోషించుటకు వీలు లేదు, బిడ్డల విషయమున యీ నిర్ణయము గావించుటకు వయోవృద్ధులతో గూడిన ట్రయర్స్ అను సంఘముండును. పుట్టిన బిడ్డను వారికి చూపవలెను. వారనుమతించిన ఆ బిడ్డను తల్లిదండ్రులు సాకుదురు. లేకున్న విసర్జింతురు. స్పార్టాలోని బిడ్డకు లోకములోని అన్యశిశువులకు వలె

పుట్టినపు డుద్దకమున స్నానము చేయింపరు. వారిని ద్రాక్షాసవమున స్నానము చేయింతురు. ఈ స్నానమున దుర్బలసంతానమప్పుడే నశించును. ఉత్తమ సంతానము పదనుపెట్టిన (tempered sword) ఖడ్గము వలె రాటుదేలును. ఆ దేశమున బిడ్డల పెంపకము నేర్పరులగు దాదులచే నిర్వహింపబడును. వారిచేతులలో పెరిగిన బిడ్డలు భయంకర దృశ్యములకు గాని, ధ్వనులకు గాని వెరగందరు. చిడిముడిపాటు, ముక్కోపితనము, అసూయ, ఆయినదానికి కానిదానికి మారముపెట్టుట, పిసినిగొట్టుతనము మొదలగు దుర్గుణము లా బాలుర సమీపింపకాలవు. వారు దృఢకాయులై, నవ్వుముఖములతో స్వేచ్ఛగా సంచరించుచు ఉత్సాహముతో కాలము గడపుచుందురు.

స్పార్టాలో తల్లిదండ్రులు తమబిడ్డలకు తమ యిచ్ఛవచ్చిన చదువులు చెప్పించుటకు వీలులేదు. ఏడు సంవత్సరములు నిండువరకును బిడ్డలు తల్లిదండ్రులచెంత నుందురు. ఏడు సంవత్సరములు నిండినంతనే ఆతడు ప్రభుత్వ పాఠశాలయందు ప్రవేశించును. అచ్చట వాడు తన యీడువారిని గూడి ప్రభుత్వమువారు బోధించు విద్యల నభ్యసించును. వారు ఆటలాడుదురు. పాటలు పాడుదురు. దేహ పరిశ్రమ గావింతురు. చదువుట, వ్రాయుట, లెక్కలు వేయుట నేర్చుకొందురు. కట్టుబాటుతో నడుచుకొనుట అన్నిటికన్నను యెక్కువగా అభ్యసింతురు. అచ్చట యే బాలునకును క్రమశిక్షణ మీరినడచు అవకాశము లభింపనే లభింపదు. వారిలో చిన్నవారందరును పెద్దలు చెప్పినట్లు నడుచుకొనవలెను. ఆజ్ఞాపాలనము వారి జీవితమునకు జీవగర్ర. వారి నాయకుని యాజ్ఞ సుగ్రీవాజ్ఞ. వృద్ధులు వీరిజీవితము నతిజాగరూకతతో పరిశీలించుచుందురు. మంచిపనులను వారు ప్రోత్సహింతురు. చెడుపనులను వారింతురు. బాలురను బాలికలను వేరు వేరు జట్టీలుగా విభజించి పోటీలుబెట్టి ఆటలాడింతురు. ధైర్యసాహసములను

పురికొల్పుదురు. కష్టసహిష్ణుతను అభ్యసింపజేయుదురు. వారికి పాదరక్ష లుండవు. తలమీది కేశములను పొట్టిగా కత్తెర వేయింతురు.

పండ్రెండేండ్లు నిండినవారి కొక్క జతబట్టలను మాత్ర మిత్తురు. సుగంధద్రవ్యములను వారుపయోగింపరాదు. ఒక్కచో తినుట, ఒక్కచో పరుండుట వారికి నిత్యవిధి. పరుండుటకు వారికి పొడుగుపాటి తుంగతప్ప వేరొకమెత్త యుండదు. ఒంటిగా జీవించుబాలు డా దేశమున కనుపింపడు. దేశమున ప్రఖ్యాతిగాంచిన వృద్ధులు వారి సంరక్షణభారమును వహింతురు. వారు బాలురను వేరువేరు తరగతులుగా విభజించి ఆ తరగతులకు నాయకు లను నియమింతురు. వారు తమ అధీనమునందుండు బాలురకు వలయు విద్యల నన్నిటిని బోధింతురు. భోజనశాలయందు వారికి పుష్టికరము, ఆరోగ్యకరమునగు భోజన మొసగబడును. ఆ బాలురలో చిక్కిపోయిన వారు గాని పొట్టలుపెరిగినవారు గాని కలికమునకైనను కనుపింపరు. వారి శరీరము లెప్పుడును వారి చెప్పుచేతులలో నుండును. ఈ ఆహారమునకు తోడు వారుకావించు వ్యాయామము, వారనుసరించు సదభ్యాసములు వారి దేహములకు వలయు దార్ఢ్యమునేకాక సౌందర్యమును సైతము చేకూర్చు చుండెను. ఇట్లు విద్యాభ్యాసము కావించుచు వీరు ప్రజల స్వభావములను పరిశీలించుచు వాని మంచిచెడ్డల చర్చింతురు. ఒజ్జలు వారిని వివిధ విషయములగూర్చి ప్రశ్నించి వారి పరిశీలనాశక్తిని పెంపుగావించుచుందురు. వారి జవాబులు క్లుప్తముగను వివేకవంతముగను ఉండును. కొలది మాట లలో గొప్ప అర్థముండునట్లు వారు మాటాడనేర్తురు. వారాడు మాటలు వారుధరించు ఖడ్గములకు వలెనే సూక్ష్మముగను నిశితముగను ఉండును. వారిమాటల పద్ధతి—

ప్రశ్న :- మీ దేశమున ప్రజాప్రభుత్వము నేల నెలకొల్పరు?

జవాబు :- ముందు మీదేశమున నెలకొల్పి దాని ఫలితములను గమనించి పిమ్మట ఆ ప్రశ్న అడుగుట మంచిది.

ప్రశ్న :- మీరు దేవతలకు కావించు నివేదనములు అతిస్వల్పముగా నుండు టకు కారణ మేమి ?

జవాబు :- అందువలన మేము దేవతలకు తరచుగా నివేదనములు చేయ గల శక్తి లభించును.

ప్రశ్న :- కదనవిద్యలలో మీరు దేనిని ఎక్కువగా అభ్యసింతురు ?

జవాబు ;- మా దేశమున అడుగుపెట్టుటకు యత్నించు వైరుల తరిమి కొట్టుటకు వలయు విద్యల నన్నిటిని అభ్యసింతుము.

ప్రశ్న :- పగవారు మీదేశముమీద దాడిచేయకుండుటకు మీరేమి చేయు దురు ?

జవాబు :- పగవారు ఆశించు వస్తువులను మా దేశమున లేకుండ జేయుదుము.

ప్రశ్న :- మీ నగరమునకు మీరు దుర్గము నేల నిర్మింపలేదు ?

జవాబు ;- మీరు మీ నగరములకు యిటుకలతో దుర్గముల నిర్మింతురు. మేము మా దృఢమైన కాయములలో నిర్మించితిమి.

ప్రశ్న :- ఇట్టి కొద్ది చట్టములతో యింతనగరమును మీరెట్లు పాలింప గలుగుచున్నారు ?

జవాబు :- స్పార్టానులు మితభాషులు. అధిక ప్రసంగులు గారు. వారిని పాలించుటకు ఎక్కువ చట్టము లవసరములేదు.

ప్రశ్న ... దేశమందలి పురుషులందరిలో ఉత్తము డెవడు ?

జవాబు :- ఎవడు నీకు మిక్కిలి భిన్నముగా నుండునో వాడు.

ప్రశ్న :- స్పార్టానులు ఉన్నతవిద్య నేల యభ్యసింపరు ?

జవాబు :- మీ దుర్గుణములు మాకు పట్టుబడకుండుటకు, (స్పార్టానులు గొప్ప విద్వాంసులు గారు. అందుచేతనే వారికి దుర్గుణము లెక్కువగా నుండవు.)

ప్రశ్న :- మీదేశపు జనసంఖ్య యెంత ?

జవాబు :- దుష్టుల దాడులను అరికట్టుటకు ఎంతవలయునో అంత.

అన్యదేశీయులు స్పార్టానుల నడుగు ప్రశ్నలకు వారిచ్చు ప్రత్యుత్తరము లీ విధముగా నుండును.

స్పార్టానులు కదన కళ, తత్వ శాస్త్రములతో పాటు గాన నాట్య కళలను సైతం మభ్యసింతురు. వారి గీతములు రసవంతములు, ఆవేశ పూరితములునై యుండును.

వారు కదనరంగమున యెట్లు సాటిలేనివారో గానకళాకౌశలమున సైత మట్లే సాటిలేనివారై యుండిరి. వారిఖడ్గ మెంతపదునుగా నుండునో వారిమాట అంత తీక్షణముగా నుండును. వారు గానముచేయు గీతములలో కొన్ని—

The Spear and Song in her do meet
And justice walks about her street
పాట బల్లెము, చెట్టపట్టాలు బట్టి అట నడచును
ధర్మమునకు న్యాయమునకు ఆ నగర మాటపట్టు

Councils of wise elders here
And the young men's conquering spear
And dance and song and joy appear
అచటి యువకులు పెద్దలమాట మీరరు
వారుపట్టిన బల్లె మోటమి నెరుగదు
ఆటకు పాటకు ఆనందమునకు ఆ నగరము నిలయము

With iron stern and sharp
Comes the playing of the harp
దివ్యనాదమున హృదయముల నలరించు హార్పు
నిశితము కఠినమునైన బల్లెము
అచటి యువకుల హస్తములకు భూషణములు.

యుద్ధము చేయు అవసరము కలిగినప్పుడు వారు మ్యూజుల (దేవతల)కు బలిప్రదానములు గావించి, విలువగల దుస్తులు, శ్రేష్ఠమైన ఆయుధములు ధరించి, జుట్టు అణగియుండునట్లు దువ్వుకొని, అలంకరింప బడిన అశ్వములవలె యుద్ధమునకు కాలుదువ్వుచువచ్చి వరుసలలో నిలువ బడుదురు. వారు వరుసలు దీరి నిలువబడినంతనే వాద్యఘోషణము ప్రారంభమగును. ఆ వాద్యములతో అడుగుకలిపి వారు ముందుకు సాగుట చూచువారికి గుండె లవియజేయును. వారు యెంత భయంకర యుద్ధమునకు పూనుకొందురో వారిహృదయము లంతప్రశాంతముగా నుండును. భయము కలవరము వారిని సమీపింపజాలవు. యుద్ధములకు పోవుట వారికి పెండ్లి విందులకు పోవునట్లుండును. సమరవిజయమున యేనాడును వారికి సంశయ ముండదు. సమరదైవమును వెంటనిడుకొనిపోవువారివలె ధైర్యము కలిగి యుందురు. సమరమున విజయము లభించి వైరి పరుగిడదొడగిన పిదప వాడిక తిరిగిచూడడు అని తోచునంతవరకు తరిమికొట్టి అటనుండి వారు వెనుదిరుగుదురు. పోరజాలక పరుగిడువారిని వధించుట స్పార్టనుల కుచిత మైన పనికాదని వారు విశ్వసింతురు. ఆయుధప్రయోగమున వారు పొందిన శిక్షణమే సంగరమున వారి కీర్తిశక్తి లభించుటకు ముఖ్యకారణమని వేరుగా చెప్పవలసిన పనియుండదు. యుద్ధమున్నను లేకున్నను వారినగర మెప్పు డును సైనిక స్కంధావారమునే పోలియుండును. నిజమునకు సంగర కాలమే వారికి విరామకాలము. యుద్ధకాలమును విరామ కాలముగా గడుపు

దేశము స్పార్టావప్ప వేరొకటి లేదు. ఆ నగరపౌరుడు తానా నగరమును సేవింప బుట్టితినేగాని తనసుఖముతాను చూచుకొనుటకు పుట్టితినని భావింపడు. ధనసంపాదనమును వారు హీనకార్యముగా తలతురు. ధనికుల కా దేశమున యెట్టి గౌరవమును లేదు. హెలేట్లు భూముల దున్ని పంటలు పండించి వారిభాగము వారికి తెచ్చియిత్తురు. నిత్యావసరవస్తువులకు కొరత లేని యాదేశము వారికి స్వర్గధామముగా నుండెను. వారికి కోర్కెలు లేవు. కొరతలు లేవు. వారిజీవితము విద్యార్జనములోడను వ్యాయామముల తోడను, క్రీడలతోడను, గాననాట్యములతోడను సుఖముగా గడచిపోవు చుండును. తేనెతెట్టెలోని యీగలవలె ఆ నగరవాసులందరును ఒక్కచోట గూడి కాలము గడుపుదురేగాని ఒంటిగా గూర్చుండి తలపోసుకొను మానవు డా నగరమున కనిపింపడు.

ఆ నగరపాలనకు లికర్గస్ స్థాపించిన సెనెట్ సభయందు ముప్పది మంది సభ్యులుందురు. వారు అరువదియేండ్లు దాటినవారుగా నుందురు. దేశమందలి అత్యుత్తమ మేధావులే అందు సభ్యులు కాగలుగుదురు.

స్పార్టా నగర పౌరజీవితమంతయు పరిశీలించిన మనము వారి అంత్యక్రియలను పైతము పరిశీలించుట మంచిది. మృతులనుగూర్చి గాని మృతకళేబరములనుగూర్చి గాని వారికి మూఢవిశ్వాసము లేవియు లేవు. శవమును స్పృశించుటవలన మైలపోవునని వారు భావింపరు. వారు మృత కళేబరములను రుద్రభూములకు కొనిపోయి దహనము చేయరు. గ్రామ మధ్యముననే ఆలయములచెంత పూడ్చివేయుదురు. యుద్ధములందు ప్రాణముల బలియిచ్చినవారికి సమాధుల నిర్మింతురు. మృతులను గూర్చి వారు పదునొకండు దినములు విచారముతో గడపి పండ్రెండవ దినమున దేవునికి బలిప్రదానము గావించి మృతుని గూర్చి తలపోయుట మానివేయుదురు.

స్పార్టాలో పుట్టిన మానవునకు కనులు తెరచినది మొదలు కనులుమూయు వరకును సత్ప్రవర్తనము దేశరక్షణము అనునవి దప్ప వేరొక యంశ మును గూర్చి యోచించు అవకాశ ముండనేయుండదు.

లికర్గస్ తన శాసనములు ప్రజామోదమును వడసి, వారి ప్రభుత్వము తానుకోరినవిధమున నడచుచుండుట జూచి ఆ ప్రభుత్వము కల కాలము నిలచియుండుటకు తగిన ఉపాయమును యోచించి ఒకనా డతడు సెనెట్ సభ్యులలో నిట్లు చెప్పెను. "నన్ను మీరు పెద్దగా ఎన్నుకొని నందుకు మీ క్షేమమును గూర్చి నా చేతనైనదంతయు చేసితిని. ఇంక నొక్కపని యున్నది. అపొలో అనుమతిగొనిగాని దానిని నిర్వహింప జాలను. మీ రనుమతించిన డెల్ఫీకి బోయివత్తును. కాని నేను తిరిగి వచ్చువరకును మీరు నేను ప్రవేశపెట్టిన సంస్కరణములలో మార్పులేమియు చేయమని ప్రమాణము చేయవలయును." సెనెట్సభ్యు లతడు కోరిన ప్రమాణము చేసిరి. వెంటనే అతడు డెల్ఫీకి బోయి తానుచేసిన పనులు క్రమముగా నున్నవా లేవా యని అపోలో నడిగెను. అతని మాటలు విని అచ్చటి ఎరుకవా రిట్లు చెప్పిరి. "నీవుకావించిన చట్టములు సర్వోత్కృష్ట ములు. వానిని పాలించు ప్రజలు సర్వశుభములను పడయుదురు. వారి యశము దిగంతముల వ్యాపించును." లికర్గస్ ఆ మాటలను లిఖిత రూపమున గ్రహించి ఆ పత్రమును స్పార్టానుల కందజేయుడని చెప్పి తనవెంట వచ్చిన పెద్దలచేతికిచ్చి దేవునికి చేయవలసిన అర్చనలను చేయించి స్పార్టానులు కావించిన ప్రమాణమునుండి విముక్తులు కాకుండు ఉపాయ మును యోచించి మానవు లెవ్వరును ప్రవేశింపని ఘోరారణ్యమధ్యమునకు బోయి ప్రాయోపవేశము గావించి దేవుని ధ్యానించుచు అసువులబాసెను.

స్పార్టానులు అతడు మరణించిన అయిదువందల సంవత్సరముల వరకును అతడు కావించిన చట్టముల ననుసరించి జీవితముల గడపి, ధ్యే

సమరమున గాని ఓటమి యనుదాని నెరుగక అరివీరభయంకరుడై, అపారమగు యశము నార్జించిరి. లికర్గస్ స్థాపించిన యీ ప్రభుత్వవిధానము స్పార్టాన్ కోడ్ అను నామమున విశ్వవిఖ్యాతమై అతని నామమున కమరత్వము చేకూర్చెను.

# మార్కస్ అరేలియస్

## క్రీ. శ. 121 - 180

అరేలియస్ రాజదండమును చేపట్టు సమయమునకు రోమక సామ్రాజ్యము తన వైభవమును కోల్పోయి అతివేగముగా తన చరమదశను సమీపించుచుండెను. సీజరుకాలమున అది దుర్నిరీక్ష్యముగా నుండెను. నేడది తత్వశాస్త్రవిచారమునకు బూనుకొనెను.

శక్తిఉడిగినప్పుడు మానవుడు దైవచింతనమునకు కడంగును. సామ్రాజ్యములకు సైతము మీగతి తప్పదు. దేహబలము క్షీణించినప్పుడు బుద్ధిబల మీశ్వరాన్వేషణమునకు పూనుకొనును. సామ్రాజ్యాధికారము నశించినప్పుడు దేశములందు తత్వశాస్త్రము వ్యాప్తిచెందును.

గ్రీకులు, శక్తి ఉడిగి క్షీణదశనందినంతనే ప్లేటో తనదేశమునకు తత్వచింతనము జీర్ణించుకొన గలిగిన ఆదర్శ ప్రభువును సమకూర్ప యత్నించెను. అట్టిరాజులు జన్మించినప్పుడే మానవులకు దేవత్వము సిద్ధించు అవకాశము లభించును. సహజసంపదలలో నిండిన దేశము, సన్మార్గమున నడచు ప్రజలు, తగిన బుద్ధిబలముకలిగిన రాజు స్వర్గమును

భూమికి తీసికొనిరాగలుగుదురు. మార్కస్ అరేలియసుకు యీ అవకాశము లన్నియును లభించెను. అతడు సింహాసన మెక్కినప్పుడు రోమక సామ్రాజ్యము ఇంగ్లండునుండి పర్షియాదేశమందలి యూఫ్రెటిస్ నదివరకును వ్యాపించియుండెను. ఇంత మహాసామ్రాజ్యమును సంపాదించుటకును, దానిని కాపాడుటకును పాటుపడుటవలన రోమనులశక్తి అణగారిపోయెను. ఆ మహాసామ్రాజ్యము వారి రక్తమాంసములను పీల్చివేసెను.

విద్యాభ్యాసము మొదలిడి పదకొండవయేడు వచ్చినంతనే అరేలియస్ తత్వవేత్త యగుటకు నిశ్చయించుకొనెను. వదులుగా నుండు అంగీని తొడిగి, అతిసాధారణమగు ఆహారమును గైకొనుచు కఠిన ప్రదేశములయందు శయనించుచు అతడు కాలము గడపుచుండెను. గ్రీసుదేశమునుండి రోమకదేశమునకు వచ్చిన గ్రీకు తత్వవేత్తల బోధ లతనితలకు బాగుగా నెక్కిపోయెను. వారు రోమకదేశమున విశ్వముయొక్క విశాలత్వమును మానవునియొక్క అల్పత్వమును వివరించి చెప్పుచుండిరి. వారిలో కొందరు స్టోయిక్కులును, మరికొందరు సినిక్కులును అయియుండిరి. నిర్లిప్తతను, ధర్మప్రవర్తనమును వారు ప్రబోధించుచుండిరి. భోగలాలసత్వమును ఖండించుచుండిరి. భోగభాగ్యములను విసర్జింప ప్రబోధించు వీరికి త్యాగముచేయదగిన భోగభాగ్యము లెవ్వియును లేవు. ఇహమున త్యాగము గావింపదగినది దుఃఖముదప్ప మరియేదియును వీరికిలేదు. వీరి ప్రబోధము భూమిపై అత్యంత బలాఢ్యమగు రాజ్యమును శాసించు ప్రభువు శిరమున గాటముగా నాటుకొనెను.

పదునెనిమిదవయేట మార్కస్ అరేలియసును అతని (పెద్ద) తండ్రి దత్తుతీసికొనెను. దానితో ఆయనరాజ్య మతనికి సంక్రమించెను. పెద్ద తండ్రివలన సంక్రమించిన సామ్రాజ్యముకన్నను విశాలమైన ఆత్మసామ్రాజ్యము అత్యంత మేధావియగు అతని హృదయమున వ్యాపించియుండెను.

దత్తునివలన లభించిన ఐహికసామ్రాజ్యమును కలుగు తన భావసామ్రాజ్య మును త్యాగముగావించి విధియొక్క శాసనమునకు తలయొగ్గెను.

సామ్రాజ్యభారమును వహింపవలసిన పురుషునకు వలయు విద్య లన్నిటియందును తగిన శిక్షణము నతడు తన పినతండ్రివలన పొంది యుండెను. దేశమునందలి విద్వాంసులలో అగ్రగణ్యులగువారిచెంత అతడు చరిత్రను సాహిత్యమును అభ్యసించెను. ప్రజల నుద్రేకపూరితుల గావించి యుద్ధములకు పురికొల్పుటకు తగిన వాక్పాటవము నతడు సంపాదించెను. గుఱ్ఱపుస్వారియందు వతని శరీరము గట్టిపడెను. రాజనీతిరహస్యముల నతడు క్షుణ్ణముగా పరిశీలించెను. వ్యాయామరంగమున అన్ని విద్యలయందును అతడు తోటివారలకన్నను మిన్నయనిపించుకొనెను. కాని యింట నడుగిడి నంతనే అతడు తన యేకాంత పఠనమందిరమున గూర్చుండి రాజ్యకాంక్షకు మితి యెచ్చట నున్నది? మానవజీవితమునకు ధ్యేయ మేమి? అను ప్రశ్న ములను గూర్చి యోచింప మొదలిడెను. సామ్రాజ్యరక్షణమును గురించియు, ప్రజాపాలనమును గురించియు అతని మనసులో జరుగుచున్న తర్కవితర్క ములను గ్రహింపగలిగినచో అతని రాజ్యమందలి ప్రధానాధికారులందరును విభ్రాంతులై యుందురు. మొదట పనిచేసి తరువాత యోచించుట రోమనుల కుముఖ్యస్వభావము. అట్టిజాతికి ముందు యోచించి పిదప కార్యాచరణమునకు పూనునట్టి తర్కశాస్త్రవేత్త ప్రభువుకానుండెను.

పెదతండ్రి మరణించినవెంటనే అరేలియస్ సింహాసనమధిష్ఠించెను. అది సీజరు లధిష్ఠించిన సింహాసనము: మోసమున నెలకొల్పబడి, నిరంతర శత్రుమున కంపితమై, రక్తతర్పణముతో తనుపబడుచున్న ఆ సామ్రాజ్యము నకు నేడు అరేలియస్ అధిపతియయ్యెను. అతడు కాషాయవస్త్రముల నభిల షించెను. రాజవంశమతనిని వరించెను. భావనాప్రపంచమున విహరించు

పండితులకు సామ్రాజ్య రక్షణమునకువలయు కుట్రలు, యుద్ధములు మోదమును చేకూర్పజాలవు. అతనిపితరులు కావించిన దుష్కృత్యముల వలన నుద్భవించిన సమస్యలన్నిటికిని నేడతడు పరిష్కార మార్గములు కనుగొన వలసివచ్చెను.

అయిదు శతాబ్దములుగా రోమకచక్రవర్తుల క్రౌర్యమునకు గురియైన అనాగరక జాతులన్నియు నేడు తిరుగుబాటు గావింప మొదలుపెట్టెను. వారు అరేలియస్ ఉన్నతాశయముల నెంతమాత్రమును గౌరవింపజాలరు. ఖడ్గమునుచక్క వారు మరిదేనిని సరకుగొనరు.

టైగ్రిస్ తూర్పుభాగమున తిరుగుబాటు గావించిన పార్థియనుల శిక్షింపనతడు తనసేనలబంపెను. అరేలియసుకు సోదరప్రాయుడగు లూసియస్ వేరస్ నాయకత్వమున ఆసేన పార్థియనుల తిరుగుబాటు నణచివేసెను. సామ్రాజ్యభారము నతని కప్పజెప్పి తాను నిర్విచారముగా ప్రొద్దులు బుచ్చవచ్చునని అరేలియసు తలచెను. కాని దురదృష్టవశమున అతడు మరణించెను. సమ్రాజ్యభారము అరేలియస్ భుజస్కంధములపై నిలచిపోయెను. పార్థియనుల తిరుగుబాటు నణచివేసిన తరువాత రాజ్యమున మరికొన్ని విప్లవములు చెలరేగెను. క్వాడీ, మార్కొమన్నీ, డాన్యూబు రాష్ట్రముల ప్రజలతని మీదికెత్తివచ్చిరి. ఆల్ప్సుపర్వతముల ఉత్తరప్రాంతమున నుండు అనాగరకులు ఇటలీని కొల్లగొట్ట నుత్సహించుచుండిరి. మార్కస్అరేలియస్ మెగుపడలేదు. కోశాగారముననున్న రజతసువర్ణములను వెలుపలికిదీయించి వేలములేయించి ఆధనములో తగినసేనను సమకూర్చుకొని వైరులమీదికి నడచెను. అతని సైన్యము కొలీసియమునుండి విముక్తులయిన గ్లేడియేటరుల

డెను. అతనిసేన మొదట క్వాడీమీదికి నడచెను. పగలు సూర్యకాంతి యందు యుద్ధమునేదను, రాత్రులందు దీపపువెలుగున తత్వశాస్త్ర పరిశీలన మునను కాలముగడపుచు అతడు మానవజీవితమును చుట్టుముట్టియుండు దుఃఖమునుగూర్చియు, యుద్ధమువలన సంభవించు సమస్యలను గురించియు తనహృదయమున రేకెత్తుభావములనతడు గ్రంథస్థము గావింపసాగెను. అతడిట్లు తనజీవితమున కొంతభాగము ఖడ్గమునకు కొంతభాగము కలము నకు అంకితము గావించెను.

సీజరుకలము నడుపుటయందును, ఖడ్గము త్రిప్పుటయందును అసా ధారణమగు ప్రజ్ఞనుజూపి తనయశమును దిక్కులన్నిటియందును వ్యాపింప జేసెను. అరేలియస్ తనప్రతిభచే భౌతికయశము అశాశ్వతమైనదని ప్రపంచ మునకు చాటిచెప్పెను.

రోమనులు క్వాడీవాసులను పరాభూతుల గావించి పారద్రోలగలిగిరి. ఈ విజయము దైవికముగా లభించెనని అతని సైనికులు విశ్వసించిరి. దానికొక కారణముకలదు. యుద్ధమారంభమైన వెంటనే క్వాడీసైనికులు రోమనులను అన్నివైపులను చుట్టివేసిరి. రోమనులకు త్రాగుటకు నీరు లభింపకపోయెను. అప్పుడు వారిలోకొందరు తమగురువుల స్మరించి దేవుని ప్రార్థించిరి. వెంటనే కుండపోతగా వర్షముకురిసెను. ఆ వర్షధారలయందు వారుతమ శిరస్త్రాణములను జలములలో నింపుకొని కడుపారనీరుద్రాగి యుద్ధముచేసిరి. అదిచాలక మెరుపులుమెరిసి పిడుగులుపడి నలువైపులను అగ్నులుప్రజ్వరిల్లి క్వాడీసేనల గుడారములన్నియు దగ్ధమైపోయెను. రోమక స్కంధావారమున కెట్టినష్టమును కలుగలేదు. మార్కసు అరేలియసునకు ఘనవిజయంలభించెను. కాని అతనిసేనలోనున్న క్రైస్తవసైనికులు ఆ విజ యము తమప్రభువు (ఏసు) కృపవలననే లభించినదని లోకమునకుచాటిరి.

ఆరేలియస్ క్రైస్తవుడుకాడు. అతడు వారివాదమును నంగీకరింప లేడు. అట్లనివారిని ఖండింపలేడు. దేవుడు యుద్ధములందు తన్ను ప్రార్థించు వారికి సాయముగావించునను విశ్వాస మతనికిలేదు. దేవుడు మానవులకు తండ్రి, మానవు లొకరికొకరు సోదరులు. దేవుడు మానవులందరిని సమాన ముగా ప్రేమించును. మానవు లొకరినొకరు ప్రేమించుచు, ఆహారముగొనుట యందు నోటిలోని పై పండ్లు క్రిందిపండ్లకును, క్రిందిపండ్లు పై పండ్లకును తోడ్పడునట్లును, పనులు చేసికొనుటయందు కుడిచేయి యెడమచేతికి యెడమ చేయి కుడిచేతికి సాయపడునట్లును, ఒకరికొకరు తోడ్పడుచుండవలయునని యును అతడుచెప్పుచుండెను.

రోమక సామ్రాజ్యమున క్రైస్తవులు పీడితులు. వారు దాసులు. అస్వతంత్రులు. వారికారాజ్యమున ఆస్తులుంచు హక్కులేదు. బలవంతులు, సంపన్నులునగు రోమనుల సేవించుటకే వారుజన్మించిరి. ఇహమున వారికి సుఖములేదు. క్రైస్తవమతము వారికి స్వర్గరాజ్యమున ఉన్నతపథమును సుఖ ములును లభించునని చెప్పెను. ఆ వచనములనమ్మి, జీవితమును ఏసుప్రభువు కంకితము గావించి వారు జీవయాత్ర సాగించుచుండిరి.

రోమనులయందలి తత్త్వజ్ఞులు సైతము వారి సంఘజీవిత మసంపూర్ణమైన దని భావించుచుండిరి. క్రైస్తవులదృష్టికి రోమకసామ్రాజ్యము ప్రజను పీడించు పెనుభూతమై యుండెను. ఆ భూతము ప్రజల విభజించి పాలింప శాసింప గలుగుచున్నదేగాని వారిని సమీకరించి వారియందైకమత్యము నెలకొల్పి వారికి సౌఖ్యమును చేకూర్పగలిగినట్టిదిగా వారికి గోచరింపలేదు. రోమనులు క్రైస్తవమతమును విశ్వసింపలేదు. ఆ మతమువలన లభించుపరలోక సౌఖ్య ములవారు విశ్వసింపలేదు. వారు ఈ లోకమందలి సౌఖ్యముల నభిలషించిరి. వానిని పడయు మార్గముల వారన్వేషించుచుండిరి. 'కష్టములు సంభవించి

పై కత్తి నెత్తవలసిన దుస్థితి నాకు సంభవించినది. నేటి వరకును అతనికి నేనొక్క అపకారమైనను చేయలేదు- సరిగదా- తలపెట్టియైనను ఉండలేదు. అతనికినేను చేయని ఉపకారములేదు. ఇప్పటికైనను అతతని మీద నాకు కోపము వచ్చుటలేదు. ఒక్క విచారము మాత్రము నన్ను పీడించుచున్నది. అది ఏమందురా? అతడీ యుద్ధమున నన్ను జయింపలేడు సరిగదా, ప్రాణములతో ఆతడీ యుద్ధరంగమునుండి తప్పించుకొని ఆవలికిపోవలేడు. అతడు నా యెదుటికి నిలువబడు ధైర్యములేక ఆత్మహత్యయైనను గావించుకొనును. లేదా, అతని అనుచరులలో ఒకనిచేత ప్రాణమునైనను కోల్పోవును. అప్పుడతనిని క్షమింపదగు అవకాశమును నేను కోల్పోవుదును. ఇంతకుమించి నాకు వేరొక విచారములేదు."

కాషియస్ లేవదీసిన విప్లవమొక నూరు దినములుసాగెను. అంతలో అతని అనుచరులలో నొక డతనిని హత్యగావించెను. వెంటనేరాజు తన సేనాపతులకీ క్రింది ఆజ్ఞలను జారీచేసెను. "కాషియస్ కుటుంబమునునెవ్వరును చెనకరాదు. అతని అనుచరులెవ్వారిని శిక్షింపరాదు. వారిలో దేశమునువదలి పారిపోయినవారికి స్వదేశమునకు తిరిగివచ్చి సుఖముగా జీవింపదగునని తెలియజేయుడు. వారిఆస్తుల కెట్టి నష్టమును కలిగింపవద్దు" ఈ ఆజ్ఞలనువిని అతని ప్రభుత్వమందలి రాజనీతిజ్ఞులు ఆశ్చర్యచకితులైరి.

తరువాత కొలదిదినముల కతని అర్ధాంగి మరణించెను. తన హృదయమును సంపూర్ణముగా చూరగొనిన ఆమె మరణమున కతడు చింతాక్రాంతుడయ్యెను, ప్రేమపూర్ణమైన ఆమె రూపమును మరువజాలక అతడామె బంగారు విగ్రహమును చేయించి దానిని యెదుటబెట్టుకొని తన రాజకార్యములు నిర్వహించుకొన మొదలుబెట్టెను. ఆమెపేర అతడొక అనాధ బాలికా శరణాలయమును నిర్మించెను. దుఃఖసంతప్తుడయ్యును అతడు తన విధి నిర్వహణమున అలసభావమును చూపలేదు. తిరుగుబాటు గావించు

చుండిన అనాగరికజాతుల శిక్షించుచుండెను. క్రీ.శ 179 సంవత్సరములో అతడు తన కడపటి యుద్ధమును చేసెను. సామ్రాజ్యమునకు సంభవించిన ఆపదలనన్నిటిని తొలగించెను. రణరంగములయందు అతి దీర్ఘ కాలము ఎండల కెండుచు వానలకు తడియుచు జీవితము గడపుటవలన అతని దేహము వ్యాధిగ్రస్తమై అతడు మంచమెక్కెను.

“సత్ప్రవర్తనమే జీవితమునకు ఏకైక ధ్యేయము” అను నదియే అరేలియస్ సిద్ధాంతములలో ముఖ్యమయినది. ఈ సిద్ధాంతము మొదట సైప్రెస్‌లో పుట్టి అచటినుండి గ్రీకుదేశమునకు వచ్చెను. గ్రీకును జయించిన రోమనులు ఈ సిద్ధాంతమును స్వీకరించిరి. గ్రీకుదేవతలను రోమనులు స్వీకరింపలేదు. కాని వారినీతులను వీరు తృణీకరింపలేదు. మరణానంతర జీవితమును గురించిన చర్చ వారికి రుచింపలేదు. బ్రతికి యున్న నాటిజీవితమును గురించిన చింతయే వారికి ఆదరణీయమయ్యెను.

ప్రపంచము మంచిమీద ఆధారపడియున్నది. అది ప్రకృతి నిర్మితములైన క్రమబద్ధములగు ధర్మసూత్రములమీద నడచుచున్నది. మానవులకు కష్టములేల సంభవించుచున్నవో ఆ రహస్యమును మనము కనుగొనలేము. నిజమున కొకటి మంచిది మరియొకటి చెడ్డదికాదు. అది మన ఊహ మాత్రమే. పరిమితమైన దృష్టికలిగిన మనము ఒకదానిని చెడ్డదని వేరొక దానిని మంచిదని భావించుచున్నాము. మనకోర్కెలు నెరవేరనప్పుడు మనము దుఃఖమునకు గురియగుచున్నాము. కోర్కెలను తగ్గించుకొనుట వలన దుఃఖముతగ్గును. సద్భావములు కలిగియుండుట, సత్కార్యములాచరించుట ప్రకృతి ధర్మములననుసరించి నడచుకొనుట, అనునవియే మానవ జీవితమునకు ప్రధానమైన ధ్యేయములు.

మనకు గోచరమగు వస్తువులలో శాశ్వతమైన దేదియునులేదు. అన్నియును అస్థిరములే. రోముసైతమునశించును. రోమకసామ్రాజ్య వైభవము,

రోముకు చక్రవర్తుల ఘనకార్యములు అన్నియును ఉత్తకథలే అగును. పనిలేని వారికి కాలక్షేపమునకుతప్ప అవియేవికిని ఉపకరింపవు. అన్నియును అశాశ్వతములైన మానవునకు కోరదగినదేదియునులేదా? ఉన్నది. అది ఏమన కోర్కెలన్నిటిని త్యజించుట. ప్రపంచమున సంభవించు సంక్షోభములకు దేవుడు చలించుచున్నాడా? లేదు. అట్లే మనమును విధిఆడుకొను ఆటలకు నిశ్చలులమై ఉండవలెను. త్యాగమునందే విజయమున్నది. అట్లని అరేలియస్ చేతులుగట్టుకొని కూర్చుండెనా? లేదు. దుఃఖమును, సంతోషమును వదలిపెట్టెనుగాని స్వధర్మనిర్వహణమున అలసభావ మెప్పుడును చూపలేదు. తన కష్టసుఖములయందు వైరాగ్యము సోదర మానవులయెడ ప్రేమ, ధర్మాచరణమున దీక్ష, అనునవి అరేలియస్ తత్వమున ముఖ్యసూత్రములు. మరణమునెడ అతడు భీతిని వర్జించెను. ప్రకృతి ధర్మములలో మృత్యువొకటి, ఆకలియైనప్పుడన్నము తినవలెను. నిద్రవచ్చినప్పుడు నిద్రింపవలెను. మరణము సంభవించినప్పుడు మరణించవలెను. మరణము ప్రకృతిధర్మము. జీవికి సహజసిద్ధమైనది. ప్రకృతి ధర్మములలో చెడ్డదేదియునులేదు. ఏది చెడ్డది గాదో దానినిగూర్చి భయపడరాదు అరేలియస్ ఇంద్రియములను, ఆత్మను జయించెను. అతనికి భీతిని కల్పింపగలిగినది ప్రకృతిలో ఏదియునులేదు.

క్రైస్తవులు మరణానంతర జీవితము విశ్వసింతురు. అరేలియస్ స్టోయిక్ అతనికి మరణానంతర జీవితమున విశ్వాసములేదు. నరకమున విశ్వాసములేనివానికి మరణమున భీతియెట్లుండును?

క్రీ.శ 180 వ సంవత్సరమున చలికాలములో అరేలియస్ మంచమెక్కెను. ఆ మంచముపైనుండి అతడు తన హృదయమును శోధించుకొనెను అసాధారణపండితుడు; రసవంతమైనకవితను సృష్టించిన గొప్పకవి. గొప్ప యుద్ధములుచేసి ఆశ్చర్యకరమగు విజయముల సాధించినవీరుడు— ప్రపంచమున మానవుడు సుఖమును పొందగలిగిన మార్గ మేది యని చింతింప

మొదలు పెట్టెను. ఆ చింతా సాగరమున అతని హృదయమున దోచిన భావముల నన్నిటిని అతను తన దినచర్య యందు వ్రాసి పెట్టెను. "ఎవరి కొరకు నేను పడరాని కష్టములు పడితినో, మ్రొక్కరాని వేల్పులకు మ్రొక్కితినో వారు నేనీలోకమును విడిచిపోవలెనని కోరుచున్నారు. ఈ జీవితముతో నాకికపనిలేదు!" ఇవి అతని కడపటి వాక్యములు.

రోమనులు అరేలియసును గురించి ఒక కథ చెప్పుదురు. దాని ననుసరించి ఆరేలియస్ మరణించినంతనే దేవతలతనిని కొనిపోయి ఒక గొప్ప విందు కావించిరి. విఖ్యాతయశులగు పురాతన రోమకచక్రవర్తులందరును అతనికిరువంకలనుచేరి కూర్చుండిరి. దేవతాసార్వభౌముడు (జ్యూపిటరు) ఆరోమక చక్రవర్తులజూచి 'మీలో అగ్రగణ్యుడెవడు?' అనిప్రశ్నించెను చక్రవర్తులొకరివెంట ఒకరు లేచితమ ఘనకార్యములగూర్చి ఉపన్యసించిరి. కట్టకడపట ఆరిలియస్‌లేచి" నేను కీర్తినెన్నడును ఆశింపలేదు. యశోదాయకములగు పనులేవియు నేను చేసి యుండలేదు" అనిచెప్పికూర్చుండెను. ఓటుతీసికొనినప్పుడు దేవతలలో అధిక సంఖ్యాకులు అతనికే ఓటువేసిరి. "రోమనులలో అగ్రగణ్యుడు" అను చిహ్నము గలిగిన కిరీటమును జ్యూపిటర్ అతనిశిరమున నుంచెను.

అతడు రచించిన గ్రంథములలో 'Meditations' అను గ్రంథమొక్కటి మాత్రము మనకు లభించుచున్నది.

# టిమోలియన్

1. కార్తేజి గ్రీసుదేశములో ఒక భాగము.
2. సిసిలి. ఇటలీకి దక్షిణమున మధ్యధరా సముద్రమున నున్న ఒకద్వీపము

3. కార్తేజి– ఆఫ్రికా ఉత్తర భాగముననున్న దేశము
1. సైరాక్యూసు, 2. కటానా
3. అక్రొడినా మొదలగునవి సీసిలీ ద్వీపమందలి నగరములు.

నేటి యువతీయువకులుఅనుదినమును చూపుడు అద్దముల యెదుట నిలచిముఖముల నలంకరించుకొందురు. దుస్తుల సవరించుకొందురు. ఇంతకన్ననువారు చేయదగిన మంచిపని మరియొకటియున్నది. అది యేదన–మహాపురుషుల జీవిత చరిత్రముల పఠించివారి ఘనతను గుర్తించి తదనుగుణముగా దమ జీవితముల చక్కదిద్దుకొనుట! ముకురము శరీరము యొక్క బాహ్య సౌందర్యమును పెంపుగావించుకొనుటకు మాత్రమే ఉపకరించును. మహాపురుషుల జీవిత చరిత్రములట్లుగాక ఆత్మోన్నత్యమును పెంపుగావించుకొని జీవితమును సార్థకముగావించుకొనుట కుపకరించును.

స్మరణీయములైన జీవితచరిత్రములలో టిమోలియన్ చరిత్ర ఎన్నదగినది. ఇతడు సిసిలీ ద్వీపములో నడుగిడిన సమయమున డియోనిసస్ ఒక ప్రాంతమును హిసేటస్ మరియొక ప్రాంతమును ఆక్రమించి నిరంకుశులై ఆ దీవిని పాలించుచుండిరి. వారు పెట్టు బాదలు పడలేక ప్రజలలో అధిక సంఖ్యాకులు దేశమును వదలి అన్యదేశములకు వెడలిపోయిరి. అట్లు పోపుటకు శక్తిలేక అచ్చట నిలచియున్నవారు. ఆబాధలనుండి తమ్మునివి ముక్తులగావింపుడని కొరిన్థియనులను వేడుకొనిరి.

కొరిన్థియనులు స్వాతంత్ర్యప్రియులు. సిసిలియనులకు మిత్రులు టిమోలియన్ వారికి నాయకుడై సిసిలీపై దండయాత్ర సలిపి డియోనిసస్ ప్రభుత్వము నంతము గావించెను. హిసేటస్‌సేన నెదుర్కొని పోరి గొప్ప విజయములు సాధించెను. అదిగాలక కార్తేజీనుండి సిసిలీమీది కెత్తివచ్చిన కార్తాజనియను ప్రభువులగు అస్ట్రుబల్, హిమల్‌కర్ అనువీరుల నోడించి పారద్రోలి సిసిలీలో ప్రజాప్రభుత్వమును నెలకొల్పెను.

టిమోలియన్ తండ్రి టిమోడెమస్. తల్లి డెమారిస్టే, ఇరువురును ఉన్నత వంశ సంజాతులు. టిమోలియన్ చిన్ననాటినుండియు సత్యప్రియత్వమునకును శౌర్యసాహసములకును ప్రసిద్ధిగాంచియుండెను. కాని కొరిన్థియనులు సిసిలీ దండయాత్రకు బూనుకొనిన సమయమున అతడుకొన్ని అపవాదులకు గురియై యిల్లు విడచి ప్రవాస జీవితము గడుపుచుండెను. అట్టి సమయమున టెలెక్లిడెస్ అను యువకుడతనిని సమీపించి "నీ ప్రజ్ఞను ప్రదర్శించి అజరామరమగు కీర్తిని సంపాదింప దగుసమయము వచ్చినది. కావననీవు ప్రజల కోర్కెను మన్నించి వారిసేనకు నాయకత్వము వహించి సిసిలీ ప్రజల దాస్య విముక్తుల గావింపుము." అనిచెప్పెను. టిమోలియన్ అతని ప్రతిపాదనమునకు తనసమ్మతిని ప్రకటించి ఆ ప్రయత్నమున తనకు తోడ్పడుమని అపోలోకు మ్రొక్కుటకై డెల్ఫికి వెడలిపోయెను.

కొరిన్థియనులు సిసిలీ దండయాత్రకు సన్నాహములు మొదలిడినంతనే ప్రొసర్పినా ఆలయపు పూజారిణిరివాని సమీపించి "యుద్ధమున మీకు సాయముగావింప దేవి స్వయముగా మీ వెంట వత్తునని నాకు స్వప్నమున గోచరించి చెప్పినది" అని చెప్పెను. ఆదేసమయమున డెల్ఫీలోనుండిన టిమోలియనుకు అపోలో ఆలయమున సైతము శుభశకునములు గోచరించెను అతడచ్చట పూజలు ముగించి స్వగ్రామమును జేరినంతనే కొరిన్థియనుల త్యుత్సాహమున బయయిదేరి తమనావలెక్కిరి. అనుకూల పవనముల

సాయమున వారినౌకలు సిసిలీని సమీపించి రేగియమ్ అను నగరమున నచుగిడిరి.

వారచటికిజేరి నంతనే హిసేటస్ దూతలు రహస్యముగా టిమోలియ నును సమీపించి నీ సేనను స్వదేశమునకు బంపివేసి ఒంటిగా నీవు హిసేటస్ చెంతకు వచ్చుచో అతడు నీకు గొప్పపదవినిచ్చి తనచెంత నుంచుకొనును. లేకున్న కార్తాజినియనులు మీ నౌకాబలమును క్షణములో నిర్మూలింతురు" అనిచెప్పెను. కార్తాజినియనుల నౌకాబలము వారి నౌకాబలమున కన్నను రెండురెట్లు పెద్దదిగా నుండెను వారు హిసేటస్‌కోర్కెను మన్నించి అతనికి సాయముగాపంప వచ్చియుండిరి. వారినెదుర్కొని పోరుటకది యుక్తమయిన తరుణముగాదు. ఈ ప్రమాదమును ఉపాయముతో తప్పించుకొనవలెను. అతడు దీర్ఘముగా యోచించి "రేగియమ్ పౌరులతో సంప్రతించి తన నిర్ణయ మును వారికి తెలుపుదునని"చెప్పి కాలయాపనచేయ మొదలుబెట్టెను. రేగి యమ్ పౌరులు అంతరంగమున కొరిన్తియనులకు మిత్రులు, ఆ మర్మము తెలియక అచ్చటికివచ్చిన కార్తాజినియనులు కొరిన్తియనులయెడ అలస భావముబూని వినోదములయందు ప్రొద్దులుబుచ్చుచుండిరి. ఆ అదనుచూచు కొని పౌరుల సాయముతో కొరిన్తియనులు రాత్రి సమయమున రేవుదాటి అతివేగముగా పయనించి టారమేనియమ్ చేరుకొనిరి. అచ్చటి ప్రజలు వారికి ఘనమైన స్వాగతమునిచ్చిరి.

హిసేటస్ చేయునదిలేక తనకు సాయము గావింప వచ్చిన కార్తా జినియనులను వెంటనిడుకొని అడ్రానమ్‌ను ఆక్రమింపబోయెను, వెంటనే అచ్చటి ప్రజలు అతని బారినుండి తమ్ము రక్షింపుమని టిమోలియన్ కడకు దూతలబంపిరి, వారికోర్కెను మన్నించి టిమోలియన్ పన్నెండు వందల మంది భటులను వెంటబెట్టుకొని ఆ నగరమునకు బయలుదేరెను. హిసేటస్ అంతకుముందేపోయి ఆ నగరమును తన సైన్యముతో ముట్టడించియుండెను

ప్రొద్దుగ్రుంకు సమయమున రాత్రి భోజనమునకువలయు ఆహారపదార్థము లను వచనముగావించుకొనుటయందు వారు నిమగ్నులై యుండిరి. అంతలో టిమోలియన్ సేనలచటికివచ్చెను. నలుబదిమైళ్ళు నడచివచ్చిన సైనికుల కాసేయి విశ్రాంతినొసగి మరునాటియుదయమున యుద్ధము ప్రారంభించుట ఉచితముగా నుండునని ఉపసేనాపతులు పలికిరి. వారి సలహానుత్రోసిపుచ్చి ఆకస్మికముగా తాకినప్పుడే శత్రువుల నోడించుట సులభసాధ్యమగునని పలుకుచు టిమోలియన్ తన అశ్వమును ముందుకురూకించెను. సైనికులతని ననుసరించిరి.

హిసేటస్ వెంట అయిదువేలమంది భటులుండిరి. కాని వారు యుద్ధ మునకు సన్నద్ధులై యుండలేదు. అయుధములెచ్చటనో గుడారములయందుం డెను. ఆకస్మికముగావచ్చి మీదపడిన శత్రువును జూచికలవరపడి వారటు నిటు పరుగిడ నొడగిరి. అయదను జూచుకొని కొరింథియనులు వారిపై బడి యిచ్చవచ్చినట్లు నరికివేయజొచ్చిరి. చీకటిపడునప్పటికి వారి ఖడ్గములకు మూడువందలమంది భటులుబలియైరి. ఆరువందలమంది వారికి ఖైదీలుగా జిక్కిరి. మిగిలినవారు పారిపోయిరి. సమస్త సంపదలతో నిండియుండిన వారి డేరాలను టిమోలియన్‌భటులు ఆక్రమించిరి. అడ్రానమ్ ప్రజలు వారికి ఘనస్వాగతమునిచ్చిరి. తమ విజయమునకు కృతజ్ఞతను దెలుపగోరి టిమోలియన్ తనసేనలో ఆ నగరాధిదేవత ఆలయమునకుబోయెను. ఆలయ మందలి దేవివిగ్రహము చెమటలు గ్రక్కుచుండెను. తమవైరుల నిర్మూ లించుటకు తమకన్నను ఆ దేవియే ఎక్కువకృషి సల్పినదని భావించి వారా మెకు హృదయపూర్వకముగా మ్రొక్కులుచెల్లించిరి. (శిలలయందు జీవ శిలలు, నిర్జీవశిలలు అను రెండు రకములుండుననియు జీవశిలలు చెమటపట్టు చుండుననియు విజ్ఞులువచింతురు.)

ఈ విజయమునుజూచి సిసిలీయందలి పెక్కు నగరములు వీరి పక్ష

మవలంభించెను. ఆ నగరములేగాక నాటివరకును సిసిలియనులకు బద్ధవై రిగా నుండిన డియోనిసస్ (డ్యొనిసస్) సైతము తన దుర్గమును వారి స్వాధీనము గావింతునని తెలిపెను. కాని అతనికిప్పుడు స్వేచ్ఛలేదు. హిసేటస్ తన సేనతో అతని సైరాక్యూసు దుర్గమును ముట్టడించియుండెను. బహిరంగ ముగా గాక రహస్యముగా దాని నాక్రమింప వలసియుండెను. అందుచే టిమోలియన్ ఒక పథకము వేసి నాలుగువందలమంది భటులనిచ్చి యిరువురు సేనానుల (ఈక్లిడెస్, టెలమకసులను) నచటికంపెను. వారు మారువేష ములతో రేలయందు పయనములు సాగించుచు డియోనిసస్ తెరచియుంచిన రహస్యమార్గమున దుర్గమున ప్రవేశించిరి. ఆ నగరమున వారికి రెండువేల మంది భటులతోపాటు రెండువందల అశ్వములుసైతము లభించెను. నగర మును వీరి కప్పజెప్పి డియోనిసస్ వారు ప్రవేశించిన రహస్యమార్గముననే దుర్గమునువిడిచి సురక్షిత స్థానమునకు వెడలిపోయెను. మానవుని కర్మము గాని విధి విలాసములననుసరించి ఒక్కపూటలో ఒక్క దుర్గాపతి సామాన్య మానవుడుగా మారిపోయెను!

రణరంగమున టిమోలియనును జయింపజాలని హిసేటస్ కుటిల మార్గమున అతనిని వధింపనిశ్చయించి యిరువురుహంతకుల నాకార్యమునకు నియమించెను. ప్రాణభయమెరుగని టిమోలియన్ అంగరక్షకుల సాయ మున్ను వదలి దేవదర్శనము గావించుటకై ఆలయమునకు బోయియుండెను. ఆ తరుణమునుగనిపెట్టి హంతకులు ఆతనివెనుకనే ఆలయమున ప్రవేసించిరి వారిలో నొకడుకత్తిదూసి టిమోలియనును సమీపించెను. అంతలోనొక ఆగం తకుడు వచ్చి రెప్పపాటుకాలములో తన కత్తిదూసి ఆతనిశిరమును ఖండించి వేసెను. రెండవహంతకుడు దానినిజూచి భయపడి పారిపోవయత్నించెను. గుడివెలుపలనున్న రాజభటులు వెంటనే అతనిని హంతకునివధించిన ఆగంత కుని బంధించి టిమోలియన్ ఎదుట నిలువబెట్టిరి. హంతకుడు గడగడవణకుచు

తమతప్పేమియులేదనియు హిసేటస్ ఆజ్ఞమీరజాలక ఆ మహాకార్యమునకు పూనుకొంటిమనియు చెప్పెను. ఆగంతకుడు తన పితృహంతకుడగుటచేవానికి ప్రతీకారముగా అతనిని వధించితినని చెప్పెను. వారికథలను సాంతముగావిని తన యత్నమేమియు లేకయే తనకు సంభవించిన ఆపద తప్పిపోవుటకు ఈశ్వరుని కృపయే కారణమని నమ్మి ఆయనకు కృతజ్ఞతాపూర్వకముగా వందనము లాచరించి తన్ను శరణువేడిన నేరస్థుల నిరువురిని దయదలచి స్వేచ్ఛగా విడిచిపుచ్చెను.

హిసేటస్ యీ వార్తవిని టిమోలియను నంతమునొందించుటకు స్వల్ప యత్నములు చాలవని నిశ్చయించి ఉన్నసేనలన్నిటిని వెంటబెట్టుకొని రమ్మని కార్తాజినియన్ నౌకాదళాధిపతియగు మాగోకు వర్తమానమంపెను. అతడు వెంటనే సుశిక్షితులైన భటులచేనిండిన నూటయేబది యుద్ధనౌకలను వివిధ యుద్ధప్రయోగసమర్థములయిన యంత్రములనుగొని సైరాక్యూసుకువచ్చెను. హిసేటస్ వారి సాయముతో దుర్గము నాక్రమింపయత్నించెను. కాని దుర్గమందలి కొరింథియనులు కొంచెమైనను వెరగందక వారిని ప్రతిఘటించుచుండిరి. కార్తాజినియనులు ఎంతయత్నించినను దుర్గము వారికి వశపడదాయెను. అంతలో కటానావాసులు దుర్గరక్షకులకు రహస్యముగా ఆహారపదార్థములు చేరవేయుచుండిరని వారికితెలిసెను కటానా నాక్రమించిన గాని దుర్గము తమకు లోబడదని తలచి కొంతసేనను దుర్గముచెంతనిలిపి మిగిలినసేనను వెంటగొని హిసేటస్ కటానా నాక్రమింపబోయెను. వారు ఆవలికి పోయినంతనే కొరింథియనులు కోటవెలుపలికివచ్చి తమ దుర్గమును ముట్టడించియున్న హిసేటస్ సేనలను సమూలముగా నిర్మూలించి అచటి కనతిదూరముననున్న అక్రాడినాను ఆక్రమించిరి. హిసేటస్ అచ్చట నిలువజేసియున్న ఆహార పదార్థములన్నియు వారిచేతికిచిక్కెను. కటానాను సమీపించుచుండిన హిసేటస్ యీ వార్తవిని వెంటనే సైరాక్యూసుకు తిరిగివచ్చెను. ఇట్లు కొరిం

దానిని పొందజాలక పృన్నుదానిని పోగొట్టుకొనిన అతనిస్థితి రెంటికినిజెడిన రేవని స్థితియయ్యెను.

కొరి న్థియనుల విజయవార్తలు దేశమందలి అన్నిదిక్కులకును వ్యాపించెను. ఈ వార్తలువిని తురీని పాలించుచుండిన హాన్నో వీరికి సాయము గావింపనిశ్చయించి తనసేనతో వారిచెంతకువచ్చెను. టిమోలియన్ వారి సాయముతో మస్సేనాను ఆక్రమించెను, ఈ యుద్ధములయందు కొరి న్థియనుల కవనకళాప్రావీణ్యమును జూచిన మాగో వికలహృదయుడ య్యెను. దానికితోడు అన్యదేశములనుండి జీతములకాశించి తమవెంటపోరు గావింపవచ్చిన సైనికులు రహస్యముగా కొరిన్థియనులతో చెలిమిగావించు చుండుట అతని కంటబడెను. మరి అచ్చటనుండిన తమకు ముప్పుతప్పదని యెంచి అతడు తనసేనను వెంటబెట్టుకొని తన దేశమునకు తిరిగిపోయెను. అపయశమును మూటగట్టుకొని పారిపోవుచున్న అతనినిజూచి నవ్వుకొనుచు కొరి న్థియనులు ద్విగుణీకృతోత్సాహముతో పోరుసాగింప నిశ్చయించిరి.

టిమోలియన్ వారి ఉత్సాహమునుజూచి ఆ సేనను మూడుభాగము లుగా విభజించి వానికితగిన సేనానుల నియమించి హిసేటస్ సేనలనుమూడు వైపులనుండి చుట్టివేసి పోర నాజ్ఞాపించెను. ఒకవంక అనాపస్ నది. మూడువైపుల వైరిసైన్యములు. వీనిమధ్య హిసేటస్ సైన్యములు చిక్కు బడిపోయెను. ఎటు కదలుటకును వీలులేక వంటయింట జిక్కిన కుంచేటి వలె నున్న ఆ సేనను కొరి న్థియనులు యిచ్చవచ్చినట్లు నరికివేయ మొదలు బెట్టిరి. ఈ వ్యూహమును పన్నుటయందు టిమోలియన్ చూపిన ప్రజ్ఞ అసాధారణ మైనదని కవనకళాకోవిదులు ప్రశంసించిరి. చిత్రమేమన యీ యుద్ధమున కొరి న్థియన్ ఒక్కడైనను మరణింపలేదు. హిసేటస్ సేనయం దత్యధిక భాగము నశించెను. స్వల్ప సైన్యముతో హిసేటస్ అతికష్టమున తప్పించుకొని పారిపోయెను. ఈ అద్భుత విజయవార్త

భటులను వెంటనిడుకొని క్రిమేసస్ నది కావలివైపున నున్న కార్థాజని యనులను మార్గమధ్యమున నడ్డగింప నిశ్చయించి బయలుదేరెను, వారి మార్గమున ఒక చిన్నపర్వతము అడ్డుగా నిలచియుండెను. టిమోలియన్ సేన లా పర్వతము నెక్కి దిగబోవుచుండెను. అంతలో వారి కాకసమున రెండు గరుడపక్షులు గోచరించెను. అందొకటి తన పాదములతో నొక చిన్న సర్పమును పట్టుకొనియుండెను. రెండవది వీరు కొండనెక్కినంతసే వీరి యుపరిభాగమునకు వచ్చి ఒక పెద్ద కూతబెట్టెను. ఆకూత విని శాకునికులు తమకా సమరమున తప్పక విజయము లభించునని వక్కాణించిరి.

అవి చలికాలమునందలి కడపటి దినములు. పొగమంచు భూమ్యాకాశముల నావరించియుండెను. కొండదిగి క్రిమేసస్ నదిని సమీపించు నప్పటికి వైరిసేనలు వారికి దృగ్గోచరమయ్యెను. అది రెండు భాగములుగా చెదరియుండెను. ఒకభాగము నదిని దాటి ముందుకు వచ్చుచుండెను. రెండవభాగము నది ఆవలివైపున నుండెను. నదిని దాటుచున్న సైనికులు కవచ శిరస్త్రాణములు ధరించి క్రమబద్ధముగా ఒకరివెనుక నొకరు అడుగులో అడుగు కలిపి నడచుచుండిరి. వారివెంట నాలుగు గుర్రములచే లాగబడుచున్న రథములు వచ్చుచుండెను. వారు కార్థాజనియనులని టిమోలియన్ ఊహించెను.

నదియావల వాలువంకలేక గుట్టలుగుట్టలుగా నడిచి ముందుకు వచ్చుచున్నవారు కిరాయిభటులగు అన్యదేశీయులు. వైరిని విభజించిపోరుట మంచిమార్గమని తలచి టిమోలియన్ ఒక పెద్దకేకపెట్టి గుర్రమును ముందుకు దూకించెను. అతడుపెట్టిన కేక అతిభయంకరమై మానవాతీత శక్తులు కావించిన సింహనాదమువలె నుండెను. ఆకేక విని దైవమే

అతనికంఠమున జేరి ఆకేక వెట్టెనని విశ్వసించి కొరి న్తియనులు అత్యు త్సాహమున అతనివెంట ముందుకు దూకిరి. రణదుందుభులు భయంకర ముగా మొరసెను. కనులుమూసి కనులుతెరచునంతలో కొరి న్తియనులు కార్తాజనియనులపై బడి వీరవిహారము గావింప మొదలుపెట్టిరి.

అంతలో భయంకరముగా నురుముచు పెద్ద గాలివాన ప్రారంభ మయ్యెను. వడగండ్లతో గూడిన తీవ్రమైన వర్షపుధారలు ముఖమున దాకుటవలన కార్తాజనియనులకు ముందున్న కొరి న్తియనులు కనిపింప కుండిరి. దానికి తోడు విరామరహితముగా మెరుపులు మెరయుచుండి నందున వారికనులు చెదరి దూష్టినిలువకుండెను. ఉరుములు కావించు భయంకర ధ్వనులకు బెదరి అశ్వములు రథములను తమ యిచ్ఛవచ్చిన దిక్కుల కీడ్చుకొనిపోవుచుండెను. కొరి న్తియనులకా వర్షధారలు పృష్ఠ భాగమున దాకుచుండుటచే యెట్టి కష్టమునూలేక ద్విగుణీకృతోత్సాహముతో పోరగలుగుచుండిరి. కార్తాజనియనులు యెంత యత్నించినను కొరి న్తి యనులతో సమముగా పోరజాలకుండిరి. వారి మృతులసంఖ్య క్షణక్షణ మునకును పెరిగిపోవుచుండెను. దానికితోడు దిక్కుల చీకటులు వ్యాపించు చుండెను! మరి పోరిలాభము లేదని తలచి వారు పారిపోవ యత్నించిరి. కాని వారెట్లు పారిపోవగలుగుదురు? అప్పుడు కురిసిన వర్షమువలన నది పొంగిపొరలి ప్రవహించుచు దాటుటకు వీలుగాకుండెను. ముందుకుపోవుట మన కొండ అడ్డముగా నుండెను. పార్శ్వములను కొరి న్తియను లాక్రమించి యుండిరి. ఆడక త్తెరవంటి తమ వ్యూహమున జిక్కిన ఆ కార్తాజనియను లను కొరి న్తియనులు యిచ్ఛవచ్చినట్లు పొడిచివేయుచుండిరి. ఆ యుద్ధమున కార్తాజనియనులు మూడువేలమంది స్వదేశీయులును, ఏడువేలమంది అన్య దేశములనుండి వచ్చిన కిరాయిభటులను కోల్పోయిరి. (ఇది వారి రికార్డు లలో గుర్తింపబడిన సత్యము).

ఆ సమరమున విజయలక్ష్మిని చేపట్టిన కొరింథియనులకు అమూల్యములగు సువర్ణాభరణములు, అసంఖ్యాకములగు శిరస్త్రాణాద్యాయుధములు లభించెను. కార్తాజనియనుల గుడారములు అమూల్యములగు వస్తుజాలములతో నిండియుండెను. వానినన్నిటిని కొరింథియనుల కిచ్చి సంధి గావించుకొని జీవించియున్న కార్తాజనియనులు తమ స్వదేశమునకు తిరిగి పోయిరి.

టిమోలియన్ ఈ విధముగా కార్తాజనియనులతో తలపడి పోరుచుండ హిసేటస్ కదనమున మరణింపగా మిగిలిన సైనికుల వెంటబెట్టుకొని పట్టణముమీదబడి కంటబడిన ప్రజల వధించుచు, వారియిండ్లలో జొరబడి దొరకిన ధనధాన్యముల దోపిడిచేయ మొదలుబెట్టెను.

ఈ వార్త విని టిమోలియన్ ఒక్క క్షణమైనను ఆలసింపక ఒక సేన నతనిమీది కంపెను. ఆ సేన అతివేగముగా పయనించి హిసేటస్ సేనను అన్నివైపులనుండియు చుట్టివేసి, సుతసహితముగా అతనిని బంధించి తెచ్చి టిమోలియన్ఎదుట నిలిపెను. న్యాయాధిపతులు చట్టబద్ధముగా విచారణ జరిపి అతనికి, అతని సుతులకు మరణశిక్ష విధించిరి. అంతలో కొందరు భటులు హిసేటసు పూర్వము తమ్ము హింసించియుండుటచే కసితీర్చుకొన నిశ్చయించి అతనియింట ప్రవేశించి అతనిభార్యను తనయలను వధించిరి. అమాయకులగు వారి మరణవార్త విని టిమోలియన్ మిక్కిలి దుఃఖించెను.

హిసేటస్ మరణముతో సిసిలియనుల బాధలన్నియు తొలగిపోయెను. అన్యదేశములకు పోయిన సిసిలియను లందరును స్వదేశమునకు తిరిగి వచ్చిరి. వారికి మంచి ప్రభుత్వమును నెలకొల్ప నిశ్చయించి టిమోలియన్ సిసిలియనులయందలి పెద్దల నెల్లరను పిలిపించి సభచేసి ఎన్నికలు జరిపి శాసనసభను నిర్మించి ప్రజాక్షేమమునకు వలయు చట్టములు చేయించెను.

పిమ్మట అతడు స్వయముగా తనపేరుతో గద్దపెట్టించి గేలా, అగ్రిగెంటమ్ అను రెండు నగరములు నిర్మించెను. టిమోలియన్ సిసిలీలో ఈ విధముగా ప్రజాసేవ చేయుచున్న కాలమున అతని స్వదేశమగు కొరింత్‌లో టిమోతేన్, అగేసిలాస్, పెలోపిడెస్ అను ప్రఖ్యాత పురుషులుండిరి. కాని వారిలో ఎవరికిగాని టిమోలియనుకు లభించిన కీర్తి లభింపలేదు. అతడుచేసిన ఘనకార్యముల పొగడి ప్రజ అతనిని స్తుతింప వారికాని నప్పు డతడు ఏమంతయైనను గర్వింపక భగవత్కటాక్షమువలన సిసిలియనులందరు గండ్లుతొలగినవేకాని తానుచేసిన దేమియును లేదని చెప్పుచుండెను.

సిసిలీలో చేయవలసిన పనులన్నియు చేసినవెనుక అతడు స్వదేశమునకు తిరిగివచ్చునని తలచి కొరింత్‌లోని ప్రజలు అతనికి ఘనమగు స్వాగతము నొసగుటకు సన్నాహములు చేసిరి. కాని అతడు కొరింత్‌కు పోవ నిరాకరించి సిసిలీయందే ఒక ప్రశాంత ప్రదేశమున నొక చిన్నయిల్లు కట్టుకొని, దానిచెంత నొక ఆలయము నిర్మించుకొని, ఆదేవు నారాధించుచు ఆ యింట నివసింపసాగెను.

అత డట్లు ఎనిమిది సంవత్సరములు గడపినపిమ్మట అతనికి కంటి చూపు నశించెను. (అది అతనికి వారసత్వమువలన సంభవించిన వ్యాధి). అంధుడైన టిమోలియనును సిసిలియనులు విస్మరింపలేదు. రాజకీయ సమస్యలయందు గాని, కుటుంబ కలహములయందు గాని వారు పరిష్కరించుకొనలేని వ్యవహారముల నన్నిటిని అతనివద్దకు వచ్చి అతనిసాయమున పరిష్కరించుకొనుచుండిరి. ఈ విధముగా అతడు సిసిలియనులకు జాతిపితయై ఖ్యాతిగాంచెను.

ఇట్లు మహోత్కృష్టజీవితమును గడపి చెట్టుచివర అతడు పండిన పండు చెట్టునుండి రాలునట్లు ఏండ్లు పూర్తిగా నిండినపిదప జీవితము

చాలించెను. సిసిలీయందలి ప్రజలందరును వచ్చి అతని అంత్యక్రియలను జరిపించిరి. దేశమున ప్రఖ్యాతిగాంచిన పురుషులందరును వచ్చి అతని శవపేటికను మోసిరి. అతని సమాధిని సిసిలియను లోక పెద్ద యాత్రా స్థలముగు గావించి గౌరవించిరి.

# నూమా పోంపిలియుస్

సూమాపోంపిలియుస్ పూర్వులెవరో ఎవరికినీ దెలియదు. అందుచే అతని పుట్టుపూర్వోత్తరముల తడవుటమాని అతని జీవితవిశేషములను మాత్రమే చెప్ప యత్నింతుము.

రోమునగరమున రోమలస్ పరిపాలన మంతమైనంతనే క్రొత్త ప్రభువు నెన్నుకొనవలసివచ్చెను. ప్రజలును, సెనెటరులును దీర్ఘముగా యోచించి పోంపిలియుసును ఆ పదవియందు నిలుపుటకు నిశ్చయించి ఆ కార్యమును గ్రామపెద్దల కప్పగించిరి. వారు వెంటనేపోయి పోంపిలియు సుకు ప్రజల అభిమతమును తెలియపరచిరి.

పోంపలియుస్ పుట్టుకతో ఉత్తమ పురుషుడు — దానికి ఉత్తమ శిక్షణము తోడయ్యెను. అల్పమానవులకు స్వభావసిద్ధముగా నుండు అధికారవాంఛ అతనికి లేదు. ఇంద్రియముల జయింపగలిగినవాడే వీరు లలో అగ్రగణ్యుడని ఆతడు దృఢముగా నమ్మియుండెను.

విద్యాభ్యాసమును పూర్తిచేసి గృహస్థాశ్రమమున అడిగిడినంతనే అతడు భోగముల విసర్జించెను. సుఖజీవనమును త్రోసిపుచ్చెను. వినోద ములను విసర్జించెను. ఎంతలాభదాయకముగా కనుపట్టినను అత ద్రక్రమ

మార్గమున నడచుట కియ్యకొనడు. దేవతల పూజించుచు భగవంతుని ధ్యానించుచు కాలముగడుప అతడు నిశ్చయించి యుండెను. అతని సత్ప్రవర్తనమును జూచి రోములస్‌కు కుడిభుజముగా నుండిన టాటియుస్ (Tatius) తన యేకపుత్రిక తాతియా (Tatia) ను అతనికిచ్చి వివాహము గావించెను. టాటియుస్ జామాతయగు అతడు ప్రభుత్వమున కోరిన పదవిని పొందగలిగియుండెను. కాని అతడా పదవులను తృణీకరించి వృద్ధుడగు తండ్రిని సేవింప నిశ్చయించి పల్లెపట్టున నున్న తన పెద్దలయింటనే నిలచిపోయెను. అతని యర్ధాంగి సైతము పుట్టినింటగల భోగముల విసర్జించి అతనిచెంతకే చేరెను. అత డిట్లు నగరజీవితమును విసర్జించి పల్లెపట్టునజేరి తోటలు, దొడ్లు, భూములు చూచుకొనుచు శాంతియుతమగు జీవితమును గడపుచుండెను.

ప్రజల సందేశమునుగొని ప్రోకులస్ వలేసనులు (Proculus - Velesus) అతని చెంతకు బయలుదేరినప్పుడు తమ ప్రతిపాదనమున కతని యంగీకారమును పడయుటకు పెద్దయత్న మవసరమని భావింపలేదు. కాని వారు పొరబడిరి. వారిమాటలు విని పోంపిలియుస్ "ఈ రాజ్యము పురుషోత్తముడగు రోములస్‌చే నెలకొల్పబడినది. అతడు దేవాంత సంభూతుడు. దేవతలసాయము పొంది అతడా పరిపాలనాభారమును సమర్థతతో నిర్వహింపగలిగెను. నేను మానవమాత్రుడను. మానవులు నేర్పిన విద్యాబుద్ధులను గరచినవాడను. అంతేగాక, నేను శాంతిప్రియుడను. దేశపరిపాలనమునకు దర్పము దౌర్జన్యము అత్యవసర లక్షణములు. అందును రోమనులు యుద్ధప్రియులు. హింసను క్రీడగా భావించువారు. వారిప్రభుత్వమున అత్యల్పభారమైనను పూనగలిగిన శక్తి నాకులేదు. అట్టి నేను వారి ప్రభుత్వభారము నెట్లు పూనగలుగుదును? నేను శాంతిని వాంఛింతును. దేవతారాధనము నభిలషింతును. ప్రతిదినమును దేవుని

పూజింపుడు. అనునిమిషమును దైవమును ధ్యానింపుచుండుడు. ధర్మము తప్పి నడువకుడు. తోడిమానవులతో కలహించుట మాని వారిని ప్రేమించుట నేర్చుకొనుడు. అన్యజాతులతో కలహించుట మాని కలసిమెలసి జీవించుట నభ్యసింపుడు. ఆయుధముల నావల బారవైచి నాగలి చేతబట్టి చెమటోడ్చి జీవింప బూనుకొనుడు" అను నామాటలు విని వారు నన్ను పరిహసింతురేగాని గౌరవింతురా? మీ కోర్కెను మన్నించి మీ ప్రభుత్వ భారమును నేను పూనుకొనుటవలన మనదేశమునకు కీడేకాని మేలు ఎన్నటికిని సమకూరదు. నన్నువదలివేసి మీరు మరియొక సమర్థుని ఎన్నుకొనుట వలన మీకునునాకును మేలు కలుగును." అనిచెప్పి అతడు వారిని పంపివేయ యత్నించెను. కాని వారతనిని వదలిపెట్టలేదు. అతడు యెంత గట్టిగా ఆ పదవి తనకువలదని చెప్పెనో వారు అంతగట్టిగా ఆపదవి నతడు నిర్వహింపక తప్పదని చెప్పిరి. చిట్టచివరకు అతనితండ్రి కలుగజేసికొని ప్రజల పాలించుటయు, వారిని సన్మార్గమున నడపుటయు భగవత్సేవయే యనియు, నిజమున కా భారము నతనిమీద పెట్టుచున్నది దైవమేకాని ప్రజలు కారనియు. అట్లుగాకున్న ప్రజ లతనిని వెదకికొనివచ్చియుండ రనియు కావున ఆ పదవిని నిర్వహించుట అతనివిధి యనియు నొక్కి చెప్పెను, అంతలో అతనిమాటలు సత్యమని చెప్పుటకో యనునట్లు పెక్కు శుభనిమిత్తములు గోచరించెను. వెంటనే యతడు తన సంశయములను వీడి ప్రజలప్రార్థనము మన్నించి ప్రభుత్వమును చేపట్టెను. ఆవార్తవిని ప్రజలు ఆనందముతో గొప్ప ఉత్సవము చేసిరి. దేశమందలి ఆలయము లన్నిటియందును అర్చనలు జరిగెను.

ప్రభుత్వము చేపట్టినపిదప అతడుచేసిన మొదటిపని రాజప్రాణములను కాపాడుటకు నియమితులై యుండిన మూడువందలమంది అంగరక్షకులను తీసివేయుట, తన్ను మేరికోరి యెన్నుకొనిన ప్రజలనుండి తాను భయపడవలసిన అంశమేమియు ఉండదని యతడు విశ్వసించెను.

పిమ్మట నతడు కదనప్రియులగు రోమనులను శాంతిప్రియులుగా మార్చుటకు నిశ్చయించి వారి రక్షణకు వారుకావించు కృషికన్నను ఈశ్వర కటాక్షము మెక్కుడు ఆవశ్యకమయినదని చెప్పి సైనిక రక్షణమునకు కావించు వ్యయముకన్నను మెక్కువ ధనమును దేవతారాధనమునకు వెచ్చింప మొదలుపెట్టెను. రాజ్యభారమును చేపట్టినకాని రాచకార్యముల కన్నను దేవతారాధనమునకే అతడు తనకాలము నెక్కువగా వినియోగింప దొడగెను. దేశము సుభిక్షముగా నుండుటవలనను, ప్రజల జీవితము సుఖముగా గడచిపోవుచుండుటవలనను అతని పూజలను, దైవభక్తిని జూచి ప్రజలు దేవతలతనికి సర్వకాలములయందును ప్రత్యక్షముగా గోచరించుచు అన్ని పనులయందును స్వయముగా తోడ్పడుచుండెనని భావింప దొడగిరి. దేవతలకు చేయు అర్చనలయందు అతడు పెక్కు నూతన విధానములను ప్రవేశపెట్టెను. రోమునగరమందలి ఆలయములలో దేవతార్చనము చేయుటకు అర్చకురాండ్రను నియమించు పద్ధతిని ప్రవేశపెట్టినవా డితడేనని రోమనులు విశ్వసింతురు. దేవతార్చనమున అతడు ప్రవేశపెట్టిన విధానములనే రోమనులు చిరకాల మనుసరించిరి. ఆలయములందు అఖండ దీపముల వెలిగించు పద్ధతిని ప్రవేశపెట్టినవా డితడే। ఏ కారణమున గాని ఆ దీప మారిపోయినచో దాని నితర దీపములతో వెలిగించుట దోషముగా భావించి వారు సూర్యకిరణములనుండి కల్పింపబడిన అగ్నినుండి జ్వాలజేసి దానిసాయమున వారా అఖండ దీపమును నిర్ణీతమైన పూజలుచేసి వెలిగింతురు. అతడు దేవతార్చనమునకు పెండ్లిపేరంటముల నెరుగని కన్యలే తగినవారని చెప్పి వారి నా కార్యమునకు నియమింపదొడగెను. ఆ కన్యలీ వ్రతమును ముప్పది సంవత్సరములు పాటింతురు. అందు మొదటి పది సంవత్సరములను వారు పూజావిధానములను, ఆలయ సాంప్రదాయములను గ్రహించుటయందు గడపుదురు. అటుపిమ్మట పది సంవత్సర

ములు వారు పూజావిధులను నిర్వర్తించుటయందు గడపుదురు. తదుపరి పది సంవత్సరములు వారా విధులను అన్యులకు గరపుటయందు గడపుదురు. ఇట్లు ముప్పది సంవత్సరములు గడపినపిదప వారు వివాహమాడి గృహస్త జీవితమును గడపు స్వేచ్ఛను పొందుదురు. దేవతారాధనమున నియుక్తలగు ఈ కన్యలకు, వారు కావించిన త్యాగమునకు దగిన హక్కులను, అధికారములను ప్రభుత్వము వారికిచ్చును. మరణశిక్షను రద్దుచేయు అధికారము సైతము వారు కలిగియుందురు. ఈ కన్యకలు కావించు నేరముల విచారించు అధికారము ప్రభుత్వాధికారుల కెవ్వరికిని ఉండదు. ఆ యధికారము ప్రధాన పురోహితున నొకనికిమాత్రమే ఉండును. కన్యాత్వమును దూషితముగావించిన కన్యలు మరణశిక్షకు గురియగుదురు. ఆశిక్ష జరుగు సమయమున నగరమంతయు విచారమును ప్రకటించును. రోమనులందు మృతసంస్కారములు కావించు అధికారము పురోహితులకు మాత్రమే ఉండును. ఈ సంస్కారమునకు జరుపవలసిన విధుల నన్నిటిని నిర్ణయించినవాడు నూమాయే! మూడు సంవత్సరములు నిండని శిశువుల మరణమునకు పాటింపవలసిన విధులేవియును ఉండవు. మృతులవలన జ్ఞాతులకు మైలలేవియు సోకవు. భర్తను కోల్పోయిన స్త్రీ పదినెలలకన్నను యెక్కువకాలము వితంతూత్వమును పాటింపవలసిన పనిలేదు. ఈలోపల పునర్వివాహమాడదలచిన స్త్రీలు దేవునకు కపిలగోవును బలియివ్వవలసియుండును.

ప్రజల తగవులను పరిష్కరించు అధికారమును నూమా పురోహితుల కిచ్చియుండెను. ప్రజలు తమకు జరిగిన అన్యాయములను పురోహితునకు నివేదింతురు. అతడు నిందితులను బిలిపించి విచారణ జరిపి నేరస్తుల శిక్షించును.

నూమా తనయింటిని వెస్టా (Vesta) ఆలయమువలెనె నిర్మించుకొని తన జీవితములో ఎక్కువ కాలము ఆమెను సేవించుటయందును అర్చించుటయందును గడుపుచుండెను. అతడక్కడ కల్పించుకొనిన నివాసమును రోమనులు నేటికిని రెగియా (Regia)అని వ్యవహరించుచున్నారు. దేవతలకు ఉత్సవములు జరుగు దినములయందు ప్రజలు వృత్తిసంబంధములగు పనులేవియును చేయరాదని నూమా శాసించెను. వారు దేవతల కర్పించు నివేదనములన్నియు బేసిసంఖ్యలో నుండవలెను. దేవునకు పూజ చేయించినవారు ఆలయమును వదలిపోవుటకు ముందు కొంత సేపు మెట్లమీద కూర్చుండవలయును. అట్లు పూజచేయించి గర్భాలయము నుండి నేరుగా యింటికిపోయిన వారిపూజలు ఆశించిన ఫలముల నీయవని అతడు చెప్పెను. ఇతడు ప్రవేశపెట్టిన సంస్కరణములు రోమనులను రణవ్యాపారములనుండి మరల్చి భగవదారాధనమున నిమగ్నుల గావించెను. ఒకానొక దినమున అతడింటనున్న సమయమున భటులువచ్చి దేశముపై శత్రువులు దండెత్తివచ్చుచున్నారని చెప్పిరి. నూమా వారిమాటలు విని “భయపడకుడు. నేనిదే దేవి నారాధింపబోవుచున్నాను.” అని చెప్పెను. సరిహద్దుసమీపమునకు వచ్చిన శత్రువులు తిరిగిపోయిరి. ప్రజల కతనిమీది విశ్వాస మినుమడించెను. “పొలిమేర దేవతలు శాంతికాములు. వారికి రక్తబలి సలుపరాదు” అని యతడు చెప్పెను.

ప్రజలను శాంతికాముకుల గావించుటకు భూసంస్కరణ మొక్కటియే తగిన విధానమని నిశ్చయించి అతడు భూములులేని రోమనులకు భూములనిచ్చి వ్యవసాయవృత్తిని యెక్కువగా ప్రోత్సహించెను. అంతేగాక అతడు వృత్తిసంబంధమగు కలహములు సంభవింపకుండుటకు ఆయావృత్తుల నవలంబించి జీవించు ప్రజల కాయావృత్తులయందు కొన్ని హక్కులు కల్పించెను. కొయ్యపని, నేతపని, కుండలు చేయుట మొదలగు

పనుల నెవరు చేయుచున్నారో వారే ఆ పనులు చేయవలెను. ఇతరులా వృత్తులలో ప్రవేశింపరాదు. ఈ వృత్తివిభజనమువలన దేశమున కలహము లంతరించి శాంతి నెలకొనెను.

నూమా కావించిన పనులలో ముఖ్యముగా పేర్కొనదగినది పంచాంగ సంస్కరణము. ఇతనికిముందు రోమును పాలించిన రోమలస్ కాలమున నెలకు నిర్ణీతకాలము లేకుండెను. కొన్ని నెలలు యిరువది దినములను, కొన్ని ముప్పదియైదింటిని, మరికొన్ని యింకను ఎక్కువ దినములను కలిగియుండెను. సూర్యచంద్రగతులకు గల భేదమును గుర్తించుజ్ఞానము వారికి లేకయుండెను. సంవత్సరమున మూడువందల అరువది దినము లుండునని వారూహించిరి. నూమా చాంద్రమానమునకు సౌరమానమునకు పదునొకండు దినముల వ్యత్యాసము కలదని గుర్తించి ఇరువదిరెండు దినములు గలిగిన ఫిబ్రవరినెలను సృష్టించి అది రెండు సంవత్సరముల కొక పర్యాయము వచ్చునని ప్రకటించెను. అతని పూర్వులు మార్చిని మొదటి నెలగా లెక్కించుచుండిరి. నూమా జనవరిని మొదటనిలిపి మార్చిని మూడవ నెలగా చేసెను. నూమాకు ముందు ప్రజలు పదినెలలనే లెక్కించుచుండిరనియు, జనవరి ఫిబ్రవరి నెలలు రెంటిని నూమాయే కల్పించెననియు కొందరు చెప్పుదురు. ఈమాట సులభముగా కొట్టివేయదగినది గాదు. వారి కడపట నెలయగు డిశంబరు, సంవత్సరమునందలి కడపటిది పదియవ నెలయే యని చెప్పక చెప్పుచున్నది. రోమనులు తమ యిష్టదైవమగు మార్సు (సమరదైవము) పేర మార్చిని మొదటినెలగా లెక్కించుటయందు అస్వాభావికత యేమియును లేదు. నూమా ఫిబ్రవరిని శుద్ధికర్మలకు ప్రత్యేకించెను. ఆ మాసమున వారు పితరులకు నివేదనములు కావింతురు. యుద్ధవ్యామోహమును దూరము చేయుట కతడు మార్చిని వెనుకకు నెట్టెను.

అతడు నలుబదిమూడు సంవత్సరములు రాజ్యము పాలించెను. అతని పరిపాలనాకాలమున సంగ్రామ మొకటియైనను జరుగలేదు. రోమనులకు యుద్ధకాంక్ష తగ్గిపోవుటయే గాక ఆ శాంతివాయువులు యిరుగుపొరుగు దేశములకు సైతము వీచి యుద్ధము లొక్కసారిగా అంతమైపోయినట్లు ప్రజలకు దోచెను.

నూమా పరిపాలనమున యుద్ధములే గాక విప్లవములు సైతము తలయెత్తలేదు. అతని ఉపాసనాబలమున దేవత లతనియందున నిలచి యుండునని తలచియో, లేక అతని దొడ్డబుద్ధిని జూచియో అతనిని వెనక నెవ్వరును యత్నింపలేదు. ఉత్తముడగు రాజు తన ఉదారగుణములచేతను, విద్యావివేకములచేతను ప్రజలను సన్మార్గమున నడిపింపగలడను మాట యితనియెడల సార్థకమైనదని చెప్పవచ్చును. ఈ లోకమున నూమాను బోలిన ప్రభువును చరిత్రలోనే మనము మరియెచ్చటను చూడజాలము.

నూమా ఎనుబది సంవత్సరములు జీవించి కొంతకాలము మంచమున నుండి క్రమముగా క్షీణించి అసువుల బాసెను. సెనెటు సభ్యులందరును అతని మృతకళేబరమును మోసి అతనిని గౌరవించిరి. అతని అంత్యక్రియలయందు రోమనులే కాక యిరుగుపొరుగు దేశములవారు సైతము పాల్గొనిరి. స్త్రీలు సైతము అతని మృతకళేబరమువెంట రుద్రభూమికి నడచిరనిన అతని ఘనత ఎట్టిదో మనమూహింపవచ్చును.

# ఫేబియస్

ఫేబియస్ హెర్క్యులిస్ సంతతికి జెందినవాడు. ఇతని పితరులలో ననేకులు ఉన్నతపదవుల నధిష్ఠించి ప్రఖ్యాతిగాంచియుండిరి. కాని బాల్యమున నితడు మెత్తనివాడుగా నుండుటవలన తోడిబాలు రితనిని "ఓవీకులా" (గొర్రెపిల్ల) అను పరిహాసనామమున పిలచుచుండిరి. ఉపాధ్యాయులు సైతమితనిని మందమతి యని భావించిరి. నిజమున కతడు పిరికివాడు గాడు, మందమతియు గాడు. స్థైర్యమును మనోనిబ్బరమును గలవాడు. ఇత డే పనియందును తొందరపడడు. ఏమాటకును కోపగింపడు. యౌవనమున నితడు వ్యాయామమున శరీరమును గట్టిపరచుకొనెను. ఉన్నతవంశజుల కత్యవసరమగు విద్యల నన్నిటికి అభ్యసించెను.

ఇతడు ఐదవ పర్యాయము కౌన్సల్‌గా ఎన్నికైన సమయమున హన్నిబాల్ వీరి దేశముపై దండెత్తివచ్చి ట్రెబియాచెంత వీరిసేనల నోడించి టస్కనీని కొల్లగొట్టి దేశమున వీరవిహారము చేయదొడగెను. హన్నిబాల్ అలెగ్జాండరు జూలియస్ సీజరు మొదలగు వీరులకు ఉద్దియనదగిన మహావీరుడు. అతనిపేరు వినినంతనే రోమనులు భయకంపితులై పరుగిడుచుండిరి. అతడు దేశమున నడుగిడినంతనే రోమనులు ఏనాడును కనివిని ఎరుగని దుర్నిమిత్తములు గోచరించెను. రైతులు నూర్చు ధాన్యమునుండి రక్తము స్రవించెను. మేఘములు కాలిన ఎర్రని శిలలను వర్షించెను. కాని యీ దుర్నిమిత్తముల లెక్కసేయక ఫ్లెమినియస్ హన్నిబాల్ నెదుర్కొని పోరనిశ్చయించి సైన్యమును సమకూర్చుకొని అశ్వము నధిరోహింపబోయెను. అది గడగడవణకి ఎగిరి ఒక్కగంతు వేసెను. ఫ్లెమి ని

యుస్ ఛిన్నభిన్నములుగా నేలపై బడెను. కాని అతని మృతగాత్రమును పరకుసేయక మరల గుర్రమునెక్కి సేనను నడిపించుకొని మున్ముందుపోయి ట్రాసిమెనె సరస్తీరమున హన్నిబాల్‌సేన నెదుర్కొని అతిభీకర భయంకరముగా పోరి అసువుల బాసెను. ఆ సమరమున హన్నిబాల్ పదిహేను వేలమంది రోమనులను పరిమార్చుటయే గాక పదివేలమంది రోమనులను ఖైదీలుగా పట్టుకొనెను. దహనాది సంస్కారముల గావింపవలచి ఎంత వెదకించినను ఫ్లెమినియస్ శవము వారికి కనిపించలేదు.

ఈవార్త విని రోమనులు కలవరమునొంది పెద్ద సభచేసి ఫేబియస్‌కు డిక్టేటరు పదవి నిచ్చిరి. ఆ పదవిని చేపట్టినంతనే అతడు అశ్వమునెక్కి సంచరింప ననుమతిని పొందెను. రోమనులు తమసేనానుల కీ యధికారము నెప్పుడును యివ్వరు. వారు తమసేనానులు పదాతిదళముల గూడి పాదచారులై చరింపవలెనను ఆచారమును పాటింతురు. నియంతృత్వాధికారమును చేపట్టినవెంటనే ఫేబియస్ రోమనులకు విజయమును ప్రసాదింపుమని దేశమందలి దేవతల కెల్లరకును పూజలు చేయించెను.

రోమనులు రణరంగమున హన్నిబాలును జయింపజాలరు. ఉపాయమున ఆ పనిని సాధింపవలెను. హన్నిబాలుకు వారితో పోరుటకు తగినంత సేనగాని, ధనముగాని, ఆహారపదార్థములుగాని లేవు. తమసేన అతని చేతికి చిక్కకుండునట్లు కాపాడుకొనగలుగుచో ఆహారపదార్థములు లేని అతనిసేన దానియంతట అదియే నశించును. ఈ పథకముతో ఫేబియస్ తనసేనను వెంటబెట్టుకొని అతనిసేనవెంట నడువజొచ్చెను. అతడు పర్వతములమీద సంచరించుచు ఛాయవలె హన్నిబాలుసేనను వెన్నాడుచుండును. హన్నిబాలు ఎంతయత్నించినను ఫేబియస్ అతనితో యుద్ధమునకు తలపడడు. అతడు ఎన్నియో పథకములు వైచెను. మరియెన్నియో ఎరలు

చూపెను. ఫేబియుస్ అతనిచేతికి చిక్కలేదు. హన్నిబాల్ కదనమును వాంఛించెను. అతని కది లభించదు.

కాని రోమనుల అశ్వసేనాపతియగు మినూషియసుకు యితని పద్ధతి నచ్చలేదు. హన్నిబాల్ ఎరలుచూపుచున్నాడని గ్రహింపక అతడు సేనను నశప్పులో పొరబడుచున్నాడనియు, అతనిని నిర్మూలింపదగు అవకాశ ములను ఫేబియుస్ జారవిడుచుచున్నాడనియు అతనిని నిందింపదొడగెను. అట్టిసమయమున కొందరు మిత్రులు వచ్చి 'సైనికులు నిన్ను పిరికివాడని భావించుచున్నారు' అని చెప్పిరి. ఆమాటలు విని ఫేబియుస్ "దేశక్షేమ మును గూర్చి మెప్పుగలిగి వర్తించుట తప్పుకాదు. కాని బుద్ధిహీనుల మాటలువిని సేనను నిర్మూలించుకొనుట క్షమింపరాని నేరము. నా విధ్యుక్త ధర్మము నే నెరుగుదును. ఇతరుల మాటల నేను పాటింపను" అని పలికెను.

ఫేబియుస్ ఈ విధముగా కాలము గడుపుచుండ హన్నిబాల్ కాంపానియాను చేరుటకు బయలుదేరి మార్గదర్శకుల పొరపాటువలన కసిలినమ్ చేరెను. అది పర్వతపరివేష్టితమైన లోయ. పొరపాటున హన్నిబాల్సేన అందులో చిక్కుకొనిపోయెను. అతనిసేనను నిర్మూలించుట కదియే తగిన తరుణమని నిశ్చయించి ఫేబియుస్ నాలుగువేలమంది ధృఢ కాయులగు భటులను లోయనుండి బయటికిపోవు మార్గము నడ్డగింప నియ మించి పృష్ఠభాగమునుండి తనసేనతో హన్నిబాల్సేనను దాకెను. అతనిసేన కొన్ని ఘడియలలో కొన్నివేలమంది కార్తాజనియనులను వధించెను. హన్నిబాలు తానుచేసిన తప్పును గ్రహించి తనసేనను కాపాడుకొనుటకు ఉపాయమును ఆలోచించుకొనెను. అంతలో ప్రొద్దు గ్రుంకెను. వెంటనే అతడు కొన్నివేల వృషభములను తోలుకొనివచ్చి వాటి శృంగములకు పొట్టివిగానున్న దివిటీలను కట్టించి వాని కగ్నిని సంధించి వృషభములను

కొండలమీది కెక్కించి వదలిపెట్టెను. అవి కొండమార్గము క్రమబద్ధముగా నడచి దివిటీలు దిగగాలి కొమ్ములకు వేడితగులుట మొదలిడినంతనే బెదరిపోయి క్రమము తప్పి మందవదలి చేనికడ్డి యిచ్చవచ్చిన మార్గమున పరుగిడ సాగెను. అన్ని దిక్కులనుండియు వైరులు వచ్చి తమపై బడు చున్నారని తలచి రోమనులు తాము అడ్డగించియున్న మార్గమును వదలిపెట్టి పరుగిడ సాగిరి. ఇట్లు లోయ నుండి వెలుపలు మార్గము లభించినంతనే హన్నిబాల్ తన సేనతో సురక్షిత స్థానమును చేరుకొనెను. తెల్లవారిన పిదప దివిటీలను గట్టిన వృషభముల జూచి జరిగిన మోసమును గ్రహించి ఫేబియస్ హన్నిబాల్ సేనతో తలపడి పోరయత్నించెను. వెంటనే హన్నిబాల్ సేన యందున్న స్పానిష్ రౌతులు వారిపైబడి ఇచ్చవచ్చినట్లు వారిని పరిమార్చ సాగిరి. ఆసమయమున రోమనులనేకులు నశించిరి, అంతలో ఫేబియస్ దేవతలకు పూజలు చేయించుటకు రోము నగరమునకు పోవలసి వచ్చెను. "ఎట్టి పరిస్థితులయందును వైరులతో తలపడవద్దు" అనిచెప్పి అతడు నశింపగా మిగిలియున్న సేనను మినిషియసునకు అప్పజెప్పి రాజధాని నగరమునకు వెడలిపోయెను. పిమ్మట కొలది దినములకు హన్నిబాల్ సేనలో అత్యధికభాగము సస్యగ్రాస సంపాదనార్థము అన్యదేశములకు పోవలసివచ్చెను. హన్నిబాల్ చెంత స్వల్పసైన్యము మాత్రమే యుండెను. మినుషియస్ ఆ యవకాశమును జారవిడువరాదని నిశ్చయించి హన్నిబాల్ సేనతో తలపడి గొప్ప విజయమును సాధించెను. అతని శౌర్యసాహసములగని సైనికు లతనిని ప్రశంసింపదొడగిరి. వెంటనే రోమను లతనికి తమసేనమీద విస్తృతమైన అధికారముల నిచ్చిరి. దానివలన రోమన్ సైన్యాధిపత్యములో కలతలు సంభవించెను. మినుషియస్ తనసేనను గొనిపోయి ప్రత్యేక శిబిరము నిర్మించుకొనెను. దానిని జూచి హన్నిబాల్ ఆదియే అతనిసేనను నిర్మూలించుటకు తగిన తరుణమని నిశ్చయించి తన

లో అధికభాగమును ఒక మరుగు ప్రదేశమునదాచి ఒక చిన్నసేనతో సంచరింప మొదలుబెట్టెను. అతడు వేసిన పథకమును గ్రహింపక మినుషియస్ అతనివద్ద చిన్నసేన మాత్రమే ఉన్నదని భావించి వెంటనే తన సేనతో అతనిపై బడెను. హన్నిబాల్ ఒకసంజ్ఞ చేసెను. దానిని జూచి దాగియున్న సైనికులందరును ఒక్కసారిగా వచ్చి మినూషియస్‌సేనపై బడి దానిని నిర్మూలింప మొదలిడిరి. దేవతలు పూజముగించి తిరిగివచ్చి వీరికి కొంతదూరమున నిలిచి వీరి చర్యల కనిపెట్టి చూచుచుండెన ఫేబియస్ హన్నిబాల్ ఉరులువన్నుట, మినుషియుస్ అందు చిక్కుకొనుట కనుగొని అతనిసైన్యమును రక్షింప నిశ్చయించి తనసేనతో హన్నిబాల్‌సేన పృష్ఠభాగమును దాకెను. దానిసెదుర్కొని పోరుమార్గమును గానక పథకము చెడినదని గ్రహించి హన్నిబాల్ తన సేనను సురక్షిత స్థానమునకు గొనిపోయెను.

మినుషియస్ తనతప్పును తెలిసికొనెను. వెంటనే అతడు ఫేబియుస్ చెంతకు బోయి "మహత్కార్యముల తలపెట్టినప్పుడు పొరపాట్లు సంభవించుట లోకసహజము. కాని, తప్పుతెలిసినపిమ్మట దానిని దిద్దుకొననివాడు మూర్ఖుడగును. నేను ఆజ్ఞల పాలింపదగినవాడనేకాని ఆజ్ఞల నొసగదగిన వాడను గాను. సేనాపతిత్వమునకు అర్హులు మీరుగాని నేనుకాదు." అని చెప్పి తనఖడ్గమును ఫేబియుస్‌పాదములచెంత నుంచి నమస్కరించెను."

ఈ సమరము జరిగిన కొన్నిదినముల తర్వాత ఫేబియుస్ తన డిక్టేటరుపదవిని వదలివేసెను. రోమను లప్పుడు టారెన్టియుస్‌వర్రో అను నతనిని కాన్సలుగా ఎన్నుకొనిరి. కదనరంగమున కొంత కీర్తిని సంపాదించిన వర్రో "ఫేబియుస్ చూపినమార్గము ననుసరించి నడచినంతకాలము మన దేశమున కీ కష్టములు తప్పవు. సాహసించి గట్టిదెబ్బ తీసిన

గాని హన్నిబాల్‌కు మనకు విరగతకాదు" అనిచెప్పి ఇంటికంపెను. వ్యర్థ కాయులగు యువకుల నందరిని ప్రోగుచేసి ఎనుబదివేల సైన్యమును సమ కూర్చి కొండమీదను స్థాపించి జండా ఎత్తించెను. అది సమరమునకు చిహ్నము. హన్నిబాల్ అట్టి యత్నమునుజూచి పరమానందభరితుడైరి. ఫేబియస్ మాత్ర మట్టి ఆనందమును చెందలేదు. ఒక్కసారిగా ఇన్నివేల మంది యువకులందరును హన్నిబాల్ ప్రతాపాగ్నికి ఆహుతియగుచున్నారే యని చింతించి "ఒక్క సంవత్సర మోపికపట్టుడు. హన్నిబాల్‌సేన తనయంతటనే నశించును" అనిచెప్పెను. కాని రోమను లెవరుమాటను వినలేదు.

ఎదురుగ నిలిపిన పతాకమును చూచినంతనే హన్నిబాల్ తన ఉపసేనాపతి గిస్కోను వెంటబెట్టుకొని ఒక ఉన్నతప్రదేశమును జేరి రోమక సైన్యమును సమీక్షింపమొదలగెను. గిస్కో వారినిజూచి "ఇంతపెద్దసేనను మనమెప్పుడు చూచియుండలేదు" అనెను. హన్నిబాల్ ఆతనిమాటలు విని "సేన పెద్దదే; దాని నడుపుటకు వారికి గిస్కో లేడు" అనిపలికెను. ఆ మాటలు విని గిస్కో నవ్వెను. ఇద్దరును ఆనందముతో నవ్వుకొనుచు పర్వతమును దిగిరి.

రోమకసైన్యముల వ్యూహమును తీక్ష్ణముగా పరిశీలించిన హన్నిబాల్ సహజసిద్ధమైన ప్రజ్ఞతో తనసేనల వ్యూహమును నిర్మింప బూనుకొనెను. ఆ సమయమున అతిఉధృతముగా దుమ్ము లేపుచు వీచుచున్న గాలులు రోమకసైనికుల ముఖమును దాకునట్లును తనసేనలకు వెనుక భాగమునుండి వీచునట్లును తనసేనను నిలిపి, సేనలో అధిక సంఖ్యాకులగు అసమర్థులను మధ్యభాగమునకును. సమర్థులగు అశ్వికులను పార్శ్వభాగములకునునెట్టి సమరమున కుపక్రమించెను. రోమనులు పార్శ్వములనున్న సమర్థులను పరికింపక కేంద్రమునసున్న అసమర్థులపై బడి చేజిక్కినవారిని

వధించుచు ముందుకు సాగిపోవదొడగిరి. వెంటనే పార్శ్వములయందున్న కార్తాజనియన్ అశ్వికులు వెనుకభాగమునుండి వారిపైబడి యిచ్ఛవచ్చినట్లు వారిని వధింప మొదలుపెట్టిరి. రోమనులు వారిచేతికి జిక్కి నశించినవారు నశింపగా మిగిలినవారు కాలికి బుద్ధిచెప్పి పరుగిడిపోయిరి. తనసేన యిట్లు విరుగుటజూచి వర్రోచాటుగా వెనీషియాకు పారిపోయెను. ఈ యుద్ధమున హన్నిబాల్ ఏబదివేలమందిని వధించుటయే గాక పదునాలుగువేలమంది రోమనులను ఖైదీలుగా బట్టుకొనెను. ఈ విజయమువలన ధనధాన్యములతో నిండిన పెక్కు గ్రామములేగాక అనర్ఘములగు సంపదలకు నిలయమైన కాప్వా నగరము సైతము హన్నిబాలుకు కైవసమయ్యెను. అతని చూపు లచటి కత్యంతసమీపమున నున్న రోమునగరముమీదికి ప్రసరింపదొడగెను. రోమనులకు కాళ్ళలో వణకు పుట్టెను. నేటివరకును ఫేబియస్ అసమర్థుడని భావించినవారు తమతప్పును తాము తెలిసికొనిరి. వారు వెంటనే, తమయత్నములన్నియు విఫలములైనప్పుడు దేవు నాశ్రయించు మానవులవలె, ఫేబియస్ నాశ్రయించిరి, వెంటనే అతడు వారి సేనపై అధికారమును స్వీకరించి హన్నిబాల్ నెదుర్కొని పోరదగు ఉపాయమును గూర్చి ఆలోచింపదొడగెను. అంతలో అతనికి దైవవశమున ఒక్కమార్గము గోచరించెను. అతనిసేనలో టారెన్టియన్ భటుడొకడు కనిపించెను. అతని తోబుట్టువు టారెన్టమ్ దుర్గమున చిక్కుబడియుండెను. ఆమెచక్కదనమును జూచి ఆ దుర్గాధిపతి ఆమెను పొందయత్నించుచుండెను. ఆ దుర్గ మా సమయమున హన్నిభాల్‌వశమున నుండెను. ఆ దుర్గము నాక్రమించిన అతనిబలము క్షీణించును. కావున ఫేబియస్ దాని నాక్రమింప నిశ్చయించి తనసేనయందుండిన టారెన్టియన్ భటుని పిలిపించి అతని కశేషమగు ధనరాసులనిచ్చి టారెన్టమ్ దుర్గాధిపతిని వలలో వేసికొను ఉపాయములజెప్పి అతనిని రహస్యముగా టారెన్టమ్‌కు పంపి,

# థెమిస్టోక్లస్

థెమిస్టోక్లస్ తల్లి యూటెర్సె (Euterse) తండ్రి నియోక్లిస్ (Neocles) వారు పేదవారు కాని థెమిస్టోక్లస్ సంపన్నుల బిడ్డలభ్యసించు విద్యలనభ్యసించెను. వారివలె దేహపరిశ్రమ కావించెను. వారితో గలసి రాజనీతి పాఠములు చదివెను. అతడు చిన్ననాటి నుండియు ఉన్నతాశయములు కలిగి యుండెను. విద్యోపార్జనమున అతడు చూపిన చొరవను పరిశీలించి అతని గురువులు జీవితమున యేదియో యొకరంగమున అతడు పేరు సంపాదించునేగాని అనామకుడుగా నుండడని భావించిరి. అతని ఉన్నత భావములను జూచి సంపన్నుల బిడ్డల తయెనిడ అసూయ వహించి యుండిరి.

అతడు విద్యార్థి దశలోనున్న కాలమున గ్రీకులు మరాతాన్ చెంత పర్షియనులలో పోరి ఘనమైన విజయమును సంపాదించిరి. ఆవిజయమును సాధించిన మిల్టియాడెస్‌ను, పిన్నలను, పెద్దలను శ్లాఘించుచుండ థెమిస్టోక్లస్ వారితో కలసి ఆనందించుటకు బదులు ఒంటిగా కూర్చుండి యేదియో చింతింప దొడగెను. అదిచూచి తోడి బాలురతని నవహసించిరి. అంతేగాక గ్రీకులు ఆ యుద్ధముతో పర్షియనుల దాడులు తుదముట్టినవని భావించుచుండ థెమిస్టోకస్ అది వారి కలహములకు అంకురారోపణమని వాదించెను. ఇట్టి దూరపు చూపుతో అతడు పర్షియనుల దాడుల నెదుర్కొనుటకు మార్గములు యోచింప మొదలుపెట్టెను.

ప్రభుత్వమున ఉన్నత పదవులలో నున్నవారు అతని పథకములకు వ్యతిరేకులుగా నుండినను ప్రజాసామాన్యము అతని వచనముల నాచరించుచుండెను. వారి సాయముతో అతడు గ్రీకులకు వెండిగనుల నుండి లభించు ద్రవ్యముతో గ్రీకు నౌకాబలమును పెంపు గావించుటకు పథకములువైచెను. నాటి నుండియు గ్రీకులు నౌకాయుద్ధమున ప్రత్యేక శిక్షణమును పడయదొడ

క్కాని ఘోరజాలని మనము బ్రతికి యుండుట వలన ప్రయోజనమేమి?" అని ప్రశ్నించెను. అతడిట్లు పలుకునంతలో పెద్ద ఉయాక. మొకటివచ్చి వారు కూర్చుండి యుండిన నావతెర చాపకొయ్య శిఖరమున వ్రాలెను. గ్రీకుల కది పెద్ద శుభ శకునము. దానిని చూచినంతనే అంతవరకును యుద్ధమును దలచి వెరగుపడుచున్న వారందరును ధైర్యముబూని యుద్ధము చేయ సంసిద్ధులై నిలచిరి.

అంతలో పర్షియన్ నౌకాబలముపారి నౌకాబలమును సమీపించెను పర్షియా చక్రవర్తి గ్జెరెగ్జస్ సమరమును స్వయముగా సమీక్షింప నిశ్చయించి సాగర తీరమునఒక ఉన్నత ప్రదేశమున గొప్ప స్వర్ణ పీఠమున గూర్చుండెను. అతని ఆనతి ననుసరించి పర్షియన్ నావలు గ్రీకు నౌకలమీదికి అతివేగముగా నడచెను, థెమిస్టోక్లస్ గ్రీకు నావలను సాలామిస్ జలసంధి చెంత నిలిపి యుంచెను. అది వారికి మిక్కిలి అనుకూలమైన ప్రదేశము. కాని అనుకూలతరుణము వచ్చువరకును అతడు యుద్ధమున కుపక్రమింపడు. దాని కొరకై అతడు దేవతలకు పూజలు చేయించి బలి ప్రదానమునకు పూనుకొని యుండెను. అంతలో నౌక నావికుడీతని దక్షిణ పార్శ్వమున గట్టిగా చీదెను. ఆశుభశకునమును జూచి అతడు వెంటనే బలి ప్రదానమును ముగించెను.

అదే క్షణమున విశాల సాగరము నుండి తీరము వంకకు బలమైన గాలులు వీవ మొదలెను ఆ గాలుల కువ్వెత్తుగా అలలు లేచి సముద్రము విపరీతముగా పొంగెను. అదియే అతడు ఎదురు చూచుచుండిన తరుణము. ఆ యలలు తేలికగా నిర్మింపబడిన గ్రీకు నావలకు మిక్కిలి అనుకూలము లయ్యెను. కాని అత్యంత భారముగా నుండిన పర్షియన్ నౌకల కవి ప్రతికూలము లయ్యెను. గ్రీకు నావలు నావికులెటు త్రిప్పిన నటుతిరుగుచుండెను. పర్షియన్ నౌక లెంత యత్నించినను కదలకుండెను. యుద్ధము ప్రారంభ

మయ్యెను. నావలన్నియు ఒకదాని నొకటి ముసర్కొని పోరజొచ్చెను. పర్షియన్ నౌకాదళాధిపతియగు ఆరియామెనస్ పెద్దగాయపట్టుకొని గ్రీకుల కంటబడెను. అతడు పర్షియన్ వీరులలో అగ్రగణ్యుడు. జెర్క్సిస్ చక్రవర్తికి సోదరుడు, అతని నౌక థెమిస్టోక్లస్ నౌక కెదురుగా వచ్చి నిలచెను. పరిషియన్ నౌకలు యిరుకుగానున్న జలసంధియందు చిక్కుకొనియుండెను. పరిషయనులు వారిని కోరిన విధమున త్రిప్పి నడిపింపజాలకుండిరి. విశాల సాగరమున నున్న గ్రీకు నావలను గ్రీకు నావికులిచ్చవచ్చినట్లు త్రిప్పుచు పోరుచుండిరి. గ్రీకునావలు స్వేచ్ఛగా సంచరించు చుండెను. పర్షియన్ నావలొక్కటియైనను కదలజాలకుండెను. ఆయవకాశమును గైకొని గ్రీకు నావికులు పర్షియన్ నావికుల పై తమ బల్లెములను, పర్షియన్ నావలమీద ప్రజ్వలించు అగ్నులచే సంధింపబడిన దివిటీలవంటి ఆయుధములను ప్రయోగింపదొడగిరి. తేలికగా నుండి స్వేచ్ఛగా చలించుచున్న నావలనుండి గ్రీకు లిచ్చవచ్చినట్లు తమ ఆయుధముల ప్రయోగించుచుండ భారమై చలింప జాలకున్న నావలయందుండిన పర్షియనులు వారినెదుర్కొని పోర జాలకుండిరి. పర్షియన్ నావలొకదాని వెనుకనొకటి దగ్ధమై పోవుచుండెను. పర్షియన్ వీరు లసహాయులై తమనావలు తగులబడుచుండ చూచుచు గ్రీకుల బల్లెములకు గురియై నేలగూలుచుండిరి. పోరుక్రమముగా భయంకర రూపమును దాల్చెను. ప్రొద్దు తిరిగిపోయెను సాగరతీరమున గూర్చుండి పరిశీలించి చూచుచుండిన జెరక్సస్ చక్రవర్తికి అతని అనుచరులకు సాగరమున పెద్దమంట యొకటి గోచరించెను. అదిదివిజులు కల్పించిన ప్రళయాగ్నివలె నుండెను. పరిషియనులు ప్రాణములకు తెగించి పోరుచుండిరి. కాని పరిస్థితులు వారికి ప్రతికూలమైయుండెను. చూచుచుండగనే వారి నౌకావళమంతయు నశించిపోయెను. విజయలక్ష్మి గ్రీకులవరించెను. ఆ విజయమునకు గ్రీకు నావికులెకులెంత శౌర్యసాహసముల ప్రదర్శించిరో థెమిస్టోక్లస్ అంత

బుద్ధిబలమును ప్రదర్శించెను ఈ విజయన కడదే కర్ణధారియని చరిత్రకారు లందరును అంగీకరించిరి.

ప్రపంచమున జరిగిన గొప్పనౌకాయుద్ధములలో యిది మొదటిది. దీనికి మించిన ఘనవిజయమును సాధించిన వీరు డెక్కడనులేడు. తన నౌకా బలమిట్లు నాశనమగుట జూచిన గ్జెరక్సస్ గ్రీసు దేశములో ఒక చిన్న సైన్యమును నిల్పి మిగిలి సేనను వెంటబెట్టుకొని అతిరయమున పయనించి స్వదేశమును జేరెను.

ఈ అద్భుత విజయమునకు సూత్రధారుడైన థెమిస్టోక్లసును తమ దేశమునకు తీసికొని పోయి స్పార్టానులతని కొక రధమును బహూకరించిరి తరువాత గ్రీకులు గ్జెరక్సస్ తమదేశమున నిలిపిపోయిన పరిషయన్ పదాతి దళమును ప్లాటా చెంతను, సాలామిస్ యుద్ధరంగమునుండి పారిపోయిన పరిషియన్ నౌకాబలమును మైకేల్ చెంతను సమూలముగా నిర్మూలించిరి.

ఈ ఘనవిజయమును ప్రశంశించుచు జగద్విఖ్యాత కవులగు ఈ స్కైలస్, బైరనులు గొప్పఖండ కావ్యముల రచించి గ్రీకు వీరుల యశ మును విశ్వమునకు చాటిచెప్పిరి.